# చిత్రకారుని గురించి



జోషువ రెనాల్డ్స్

క్రైస్తవ మతాధికారికి పుట్టిన రెనాల్డ్స్ 18వ శతాబ్ది బ్రిటన్‌లో అత్యంత విశిష్టమైన కళాకారునిగా ప్రసిద్ధిచెందాడు మొదట్లో అతని ఈ చిత్రలేఖన వృత్తిని ప్రారంభించిన రోజుల్లో దానిని చాల తక్కువగా చూచేవారు కాని తన వ్యక్తిగత ప్రతిష్ఠతో, నాటి సాహితీవేత్తలతో తనకున్న సంబంధాల మూలంగా, కళాకారుని యెడ సమాజానికున్న న్యూనతా దృష్టిలో పెద్ద విప్లవం తీసుకొచ్చాడు ఆవిధంగా అతడు అప్పుడే స్థాపించిన (1768) రాయల్ అకాడెమీకి మొదటి అధ్యక్షుడు అయ్యాడు

అతని భయానక బహుముఖ ప్రజ్ఞ నగిషీలతో అతనికి పేరు, డబ్బు వచ్చింది కాని అతనికి ఎప్పుడూగూడ చరిత్ర చిత్రకాళాకారుడుకావలని కోరిక కాని అతని కళాకౌశలం దీనికి తగింది కాదు

జోషువరెనాల్డ్స్ 1723లో ప్లిమ్టన్‌లో బ్రిటన్‌లో జన్మించాడు అతడు తన తలిదండ్రులకు ఏడవ సంతానం, మూడోకొడుకు అతని తండ్రి శామ్యూల్ఒకస్కూలుకు హెడ్‌మాస్టరుకావడంతో, ఇంట్లో పుస్తకాలుండేవి. వాటిని మన చిత్రకారుడు చదివేవాడు ఇతనికి కళగురించి, కాళాకారుని అంతస్తు గురించి ఒక అభిప్రాయం ఏర్పడడానికి, ఇటాలియన్ పెయింటర్ పోజో రాసిన 'దృక్కోణం' మీది పుస్తకమూ, జోనాథన్ రిచర్డ్‌సన్ రాసిన "పెయింటింగ్ సిద్ధాంతాలు'' దోహదం చేశాయి అతడు జీవితాంతం "పండిత చిత్రకారుడు''గా ఉండడానికే ప్రయత్నం చేశాడు ఇతడు రూబెన్స్, రాఫెల్, మైక లాంజెలొలాగ పండితుడు, చిత్రకారుడు అతడు ముసలివాడైన తరవాత తన రచనలకు, చిత్రాలకు సమాన విలువనే ఇచ్చాడు

"కవిలాగ, పెయింటర్ తన నాయకుని ఒక గొప్ప వ్యక్తిలాగ మాట్లాడించలేడు కాని గొప్పవానిగా కనిపించేట్టు చూపించాలి ప్రకృతిలో ఉండేలోపాలను ఆర్టిస్ట్ అయిన వాడు సరిదిద్ది మెరుగులు పెట్టాలి తన మోడల్ 'ఉన్నతమనస్సును' ఆవిష్కరించాలి ఉదాహరణకు అలెగ్జాండరు అంత ఎత్తైన వాడుకాదు పెయింటర్ అతన్ని అలాగే చిత్రించరాదు. ఆ శారీరక పరిమితులను అధిగమించాలంటే ప్రాచీనులను అనుకరించాలి ఆదర్శ సౌందర్య నియమాలను ప్రతిబింబించే గ్రీకు, రోమన్ శిల్పాలను ఆధునిక కళాకారుడు అనుకరించాలి'' అంటాడాయన

## ముఖచిత్రం : "విషాద సరస్వతిగా శ్రీమతి సిడాన్స్''

మొదట రెనాల్డ్స్ ఈ చిత్రాన్ని 1784లో వేశాడు ఈ చిత్రం కాలిఫోర్నియాలోని సాన్‌మారినో హెన్రీ ఇ హంటింగ్‌డన్ లైబ్రరీ - ఆర్ట్‌గాలరీలో ఉంది ఇప్పుడీ చిత్రాన్ని ఐదేళ్ళ తరవాత దాని ప్రతికృతిగా మలిచాడు మైకలాంజెలో సిస్టైన్ సీలింగ్ మీద ఉన్న ప్రవక్తలలో ఒకరివల్ల ఉత్తేజితురాలైన చిత్తవృత్తిలో ఈ మహానటి చూపబడింది.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**


సంపుటి 11 సెప్టెంబరు 1999 సంచిక 9

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి


## విషయసూచిక




విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **''విషాద సరస్వతిగా శ్రీమతి సిడాన్స్''**

**Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536**
**e-mail : misimi_m@hotmail.com**
**http : //www.misimi.com**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

## 'మిసిమి'

**ప్రత్యేక సంచిక వెలువడబోతోంది**

మిసిమి వ్యవస్థాపక సంపాదకులు **డా. ఆలపాటి రవీంద్రనాథ్** జన్మదినాన్ని (నవంబరు 4వతేదీ) పురస్కరించుకొని, నవంబరు, డిసెంబరు సంచికలను కలిపి, సుమారు నూరు పుటలతో ఆధునికానంతరతావాదం మీద ప్రత్యేక సంచికగా వెలువరించ దలిచాము. అందులో సుప్రసిద్ధ పాత్రికేయ, రచయిత, చింతన, విమర్శకులైన బాలగోపాల్, వేణుగోపాల్, రామకృష్ణ, సీతారామ్, అఫ్సర్, కల్పనా కన్నాభిరాన్, సురేంద్రరాజు, ముజిబుద్దీన్, వెంకట్రావు, అలోక్ భల్లా, రవికుమార్, మో, వెంకటస్వామి, తిరుపతిరావు, రఘు రామరాజుల వ్యాసాలు ఉంటాయి.

వీరంతా పోస్ట్ మాడర్నిజాన్ని వివిధ దృక్పథాల నుంచి తమ తమ వ్యాసాలలో దర్శిస్తారు. మనలను దర్శింప జేస్తారు.

మిసిమి చదవండి. మిత్రులతో చదివించండి చందా దారులను చేర్పించండి. మిసిమి ఆలోచనలను నలుగురికి పంచండి. మిసిమి మీనుంచి ఆశించేది ఒక మంచి మాట. అదే పదిమందికి బాట అవుతుంది.

మీ కాపీలను రిజర్వు చేసుకోండి.

# చరిత్రకారుడు

## (1953 నోబెల్ సాహిత్య బహుమతి పురస్కార స్వీకారోపన్యాసము)

మూలం · **సర్ విన్‌స్టన్ చర్చిల్** అనువాదం . **డా॥ యు. ఎ. నరసింహమూర్తి**

నాకు లభించిన గౌరవాలలో నోబెల్ సాహిత్య పురస్కారం సాటిలేనిది ఇది అనూహ్యమైనది. ఘనతవహించిన మీ ప్రియతమ సార్వభౌముల చేతులమీదుగా స్టాక్ హోమ్‌లో ఈ పురస్కారాన్ని స్వయంగా స్వీకరించడానికి నా విధులు నన్ను ఆటంక పరుస్తున్నందుకు చాలా విచారిస్తున్నాను. నాకు బదులుగా నా భార్య ఈ పురస్కారాన్ని స్వీకరించడానికి అంగీకరించినందుకు కృతజ్ఞుణ్ణి

20వ శతాబ్దపు సాహిత్య ప్రపంచ అసాధారణ నిర్మాతల పేర్ల పట్టికలో నాపేరు లిఖించబడడం సామాన్య విషయమేమీ కాదు.నాగరిక ప్రపంచమంతా స్వీడిష్ అకాడమీ తీర్పును నిష్పక్షపాతమైనదిగా, సాధికారమైనదిగా, నిజాయితీ నిండినదిగా అంగీకరిస్తుంది ఉన్నత శ్రేణి రచయితల జాబితాలో నాపేరు చేర్చినందుకు నేను గర్వించినా, మీ నిర్ణయం నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది మీరు తప్పుచేయరని నేను ఆశిస్తాను ఈ సన్నివేశంలో మన ఉభయపక్షాలు ఒక చిక్కులో ఇరుక్కున్నట్లు నాకనిపిస్తోంది ఇందుకు నేను అర్హుడను కాను కాని ఇతరులెవరూ ఇందుకు అర్హులుగా మీకు తోచకపోతే ఈ విషయంలో నేనేమీ అనుమానాలుంచుకోను

1896లో ఆల్‌ఫ్రెడ్ నోబెల్ మరణించిన దగ్గర నుండి మనం ఒక తుఫానులో భీభత్సంలో ప్రవేశించేము మానవశక్తి అన్నిరంగాలలోను వృద్ధిపొందింది కాని తన విషయంలో మనిషి బలహీనుడయ్యాడు వ్యక్తిత్వాలను మరుగుజ్జులుగా మార్చే కారిన్యంగల సంఘటనలు ఇంతకు ముందు ఏ కార్యరంగంలోను మనం ఇంతగా చూడలేదు పాశవిక వాస్తవాలు ఆలోచనను పూర్తిగా అధఃకరించడం, సువ్యాప్తమైన వ్యక్తిగతశక్తి సామూహిక తేజాన్ని కొడిగట్టించడం చరిత్రలోనే అరుదు ఇప్పటిస్థితి అది మన సమస్యలు మన చేయిదాటిపోయాయా? అనే భయంకర ప్రశ్నతో మనం సతమతమౌతున్నాము నిస్సందేహంగా మనం ఇలాంటి దశలోంచి పయనిస్తున్నాము మనల్ని మనం దైన్యంలో ముంచుకుని ఒకరి దయకోసం, దారికోసం వెతుక్కుంటున్నామా!

మనం యూరపులో, పాశ్చాత్య ప్రపంచంలో ఆరోగ్యం కోసం, సాంఘిక భద్రతకోసం పథకాలు వేసేము వైద్య, విజ్ఞానశాస్త్ర రంగాలలో అద్భుతవిజయాలను సాధించేము అందరికీ న్యాయము, స్వేచ్ఛ లభించాలన్నది మన లక్ష్యము. కరువు, దైన్యం, కారిన్యం, విధ్వంసం అనే వాటికి సాక్ష్యాలు లేకుండా చేసేము అందుకే అట్టిలా (Attial) చెంఘిజ్ ఖాన్‌ల చర్యలు తెల్లముఖం వేసేలా చేసేము రోమను సామ్రాజ్య పతనానంతరం యూరపును గజగజలాడించిన పరిస్థితులకంటె భయంకరమైన పరిస్థితులతో చీలికలు పీలికలుగా మారుతున్న - ప్రపంచాన్ని సర్వమానవాళి కలగంటూన్న శాంతి గమ్యానికి చేర్చడానికి ముందుగా నానాజాతి సమితిని (League of Nations) తర్వాత ఐక్యరాజ్యసమితిని (United Nations) స్థాపించేము

ఈ తమోనేపథ్యంలోంచి ఆల్‌ఫ్రెడ్ నోబెల్‌ను, ప్రణాళికను ఉత్తేజపరచిన ఘనతను, ఆశను మనం అభినందించాలి ఆయన అత్యంత క్లిష్ట పరిస్థితిలో, ఒక తరాన్ని ఉత్తేజపరచే, ప్రయోజన కారియైన, ఉజ్జ్వలమైన, చిరంతనమైన సాంస్కృతిక తేజాన్ని మనకిచ్చిపోయాడు జగత్ప్రసిద్ధమైన ఈ సంస్థ మనం అనుసరించదగిన సత్యపథాన్ని నిర్దేశిస్తూంది కాబట్టి మనను చుట్టుముట్టి చెవులు చిల్లులు పరచే రణగొణధ్వనిని, బింకాన్ని సహనంతో, స్థైర్యంతో, ప్రశాంతతో రూపుమాపడానికి తలపడదాం

ఆలోచనలో, ఆర్థికాచరణలో, ఆరోగ్యవంతమైన జీవన ప్రగతిలో సంఘటితంగా, తమ సామ్రాజ్యాధికారాన్ని వీసంవాసి వదలుకోకుండా పురోగమిస్తూన్న మూడు స్కాండినేవియన్ దేశాలను ప్రపంచమంతా అత్యంత అభినివేశంతో ఆదరంగా చూస్తూంది ఇటువంటి ఉద్యమాలతో మానవాళి కంతటికీ కొత్త, తేజోభరితమైన అవకాశాలు లభించవచ్చును ఆల్‌ఫ్రెడ్ నోబెల్ కోరికలను, ఆదర్శాలను గౌరవించే పరిపూర్ణజ్ఞానంతో నోబుల్ ఫౌండేషన్ ఈ పురస్కారానికి ఎంపిక చేసిన వారిని చైతన్యవంతం చేసే వారి అనుభూతులిలా ఉంటాయని నేను విశ్వసిస్తున్నాను

★ ★ ★

అంగీకారానికి ముందుగా రాయల్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ సభ్యుడైన జి లివ్‌జెస్ట్రాండ్ ఈ క్రింది సూచనలను ప్రస్తావించారు ఇంతకుముందు ఎందరో ప్రధానమంత్రులకు, విదేశాంగమంత్రులకు, ఇద్దరు అమెరికా అధ్యక్షులకు నోబెల్‌శాంతి బహుమానం లభించింది కాని ఇప్పుడు, మొట్టమొదటిసారిగా, ఒక గొప్ప రాజనీతిజ్ఞునికి నోబెల్ సాహిత్య పురస్కారం లభించింది మనిషి ఆలోచనకు అద్భుతమైన, సర్వంకషమైన సాధనమైన ఆంగ్లభాషమీద తిరుగులేని అధికారం కలవానిగా సర్ విన్‌స్టన్ చర్చిల్ గుర్తింపుపొందారు చిరస్మరణీయాలైన ఆయన రచించిన జీవిత చరిత్రలప్పుడే ఐతిహాసికస్థాయి నందుకున్నాయి సమకాలీన చరిత్రకు సంబంధించిన ఆయన గ్రంధాలు అగాధమైన, సుపరిచితమైన ప్రాథమికాధారాలతో నిండి ఉన్నాయి ఆయన శైలిలో సారళ్యం, చమత్కారం, ఔదార్యం ఉన్నాయి తన గ్రంధ రచనను హేలగా ముగించడంలో సర్ విన్‌స్టన్ చర్చిల్‌కు ఇంగ్లీషు భాష ఒక ప్రబలసాధనమయింది ప్రపంచానికి చిమ్మచీకట్లు కమ్మినప్పుడు మిలియన్ల కొద్దీ ప్రజలకు ఆయన మాటలు, ఆచరణ శిలంకల ఆయన చేతలు ఎంతో ఉత్తేజాన్ని, నమ్మకాన్ని కల్పించేయి ఆయన మాటల్నే కొద్దిపాటి మార్పుతో ఇలా చెప్పుకోవచ్చును మానవ జీవన సంఘర్షణ రంగంలో ఒక వ్యక్తి అసంఖ్యాక మానవులు ఎన్నడూ ఇంతగా ఋణగ్రస్తులు కాలేదు. ఆయన రచనలతో, ఉపన్యాసాలతో ఆయన మనకిచ్చిన దానికి బదులుగా అభినివేశ గౌరవాలతో నిండిన మర్యాదపూర్వకమైన మా అభినందనలను ఆయనకు అందజేయవలసినదిగా లేడీ చర్చిల్‌ను కోరుకుంటున్నాము

**జీవిత చరిత్ర :**

రైట్ ఆనరబుల్ సర్ విన్‌స్టన్ లియొనార్డ్ స్పెన్సర్ చర్చిల్ (1874-1965) లార్డ్ రాన్డాల్ఫ్ చర్చిల్ కుమారుడు. అతని భార్య అమెరికా దేశీయురాలు ఆయన హారోలో, సాన్డర్స్టు (Sandhurst)లో

సేద్యనభ్యసించేడు సైన్యంలో ఆయిన పురోబి వృద్ధికి తోడ్పడే రీలిగా కొద్దికాలమే పనిచేసేడు 1900 సంవత్సరంలో పార్లమెంటులో కన్సర్వేటివ్ పార్టీ మెంబరయ్యాడు ఈ శతాబ్ది మొదటి మూడు దశాబ్దాలలో లిబరల్ - కన్సర్వేటివ్ పార్టీల ప్రభుత్వాలలో ఆయిన అనేక ఉన్నత పదవులను నిర్వహించేడు 1911 నుండి 1915 వరకు ఆయన ఫస్ట్ లార్డ్ ఆఫ్ ది ఎడ్మిరాల్టీ (First Lord of the Admiralty) పదవిని నిర్వహించేడు తిరిగి రెండవ ప్రపంచయుద్ధం ఆరంభమైనపుడు అదే పదవిలో నియమితుడయ్యేడు 1940 మే నుండి 1945 వరకు ఇంగ్లాండు ప్రధానమంత్రిగా, రక్షణ మంత్రిగా ఉన్నారు 1951లో కన్సర్వేటివ్ పార్టీ విజయానంతరం తిరిగి ఇంగ్లండు ప్రధాన మంత్రి పదవి చేపట్టి 1955లో రాజీనామా చేసేరు అయినా 1964 వరకు పార్లమెంటు సభ్యునిగా ఉన్నారు ఆ తర్వాత తిరిగి ఎన్నికలలో పోటీ చేయిలేదు 1953లో రెండవ ఎలిజిబెత్ రాణి ఆయనకు నైట్‌హుడ్ ఇచ్చి గౌరవించి Order of the carter లాంఛనాలతో ఘనంగా సత్కరించింది అసంఖ్యాకమైన గౌరవాలు, సన్మానాలు పొందేడాయన దానిలో 1963 అమెరికా ప్రెసిడెంట్ కెన్నెడీ ఆయనకు అమెరికా దేశపు గౌరవ పౌరసత్వాన్ని బహూకరించడం చెప్పుకోతగ్గది

ప్రచార సమాచారాలను సమకూర్చడంతో చర్చిల్ సాహిత్య వ్యాసంగం ఆరంభమయింది The Story of the Mala Kand Field Force (1898), The River War (1899) అనే రెండు రచనలు సూడాన్, ఓండుర్మన్ యుద్ధాల ప్రచారసంబంధమైన విషయంతో కూడినవి 1900సంవత్సరంలో ఆయన Savrola అనే తన ఏకైక నవలను ప్రచురించేడు. తన తండ్రి లార్డ్ రుడాల్ఫ్ చర్చిల్ జీవిత చరిత్ర అతని చెప్పుకోదగ్గమొదటిగొప్ప రచన 1933-1938సంవత్సరాల మధ్య నాలుగు సంపుటాలలో ప్రచురించబడిన, ఆయన పూర్వీకులలో ఘనుడైన డ్యూక్ మార్ల్‌బరో జీవిత చరిత్ర ఆయనకు పేరు ప్రతిష్ఠలను తెచ్చింది The World Crisis (1923-29) అనే పేర నాలుగు సంపుటాలలో ఆయన మొదటి ప్రపంచయుద్ధ చరిత్రను రాసేడు 1948-1953/54 సంవత్సరాల మధ్య ఆయన రెండవ ప్రపంచయుద్ధ సంబంధమైన తన జ్ఞాపకాల నన్నింటినీ ఆరు సంపుటాలలో వెలువరించేడు. పదవీ విరమణానంతరం 1956-58 సంవత్సరాలలో ఆయన "History of the English - Speaking Peoples'ను నాలుగు సంపుటాలలో వెలువరించేడు. గంగా ప్రవాహ సదృశమైన ఆయన వ్రాతరి పన్నెండు సంపుటాలలో నిబంధిత నుయింది వానిలో The Unrelenting Struggle (1942), The Dawn of Liberation (1945), Victory (1946) అనేవి వాటిలో ప్రసిద్ధమైనవి.

చర్చిల్ చిత్రకారుడు 1948లో Painting as a pastime అనే గ్రంధాన్ని రాసేడు 1930లో అతని యువజీవనాన్ని గూర్చి My Early Life అనే గ్రంధాన్ని రాసేడు

**సమర్పణ**

( ఎస్ సివెర్ట్జ్ - స్వీడిష్ అకాడమీ సభ్యుడు)

అసాధారణ రాజనీతిజ్ఞులు, ప్రచండ యోధులు మహారచయితలు కావడం చాలా అరుదైన విషయం

జూలియస్ సీజర్, మార్కస్ అరేలియస్, మొదటి ఇటాలియన్ దండయాత్రలో జోసెఫెన్‌కు లేఖలు రాసిన నెపోలియనుల రచనలు రసవంతంగా, ఉజ్జ్వలంగా ఉంటాయనే వారున్నారు కాని వైవిధ్యభరితమైన రచనలు చేయడంలో సర్ విన్‌స్టన్ చర్చిల్‌తో వెనువెంటనే పోల్చదగిన సరియైన వ్యక్తి డిస్రైలీ (Disraeli) ఒక్కరే. ''మహనీయ వ్యక్తులు, గణుతికెక్కని సంఘటనలు గల కాలంలో బ్రతికినవాడు'' అని రోస్‌బెరీ (Rosebory) ని గూర్చి చర్చిల్ అన్న మాటలు డిస్రైలికి వర్తిస్తాయి

రాజనీతి - సాహిత్య రంగాలలో సాధించిన విజయగౌరవంతో చర్చిల్, సిసిరో కలంతో సరితూగే రచనావైభవం గల సీజర్‌తో సమానుడని అనాలని ప్రతివాడికీ అనిపిస్తుంది సాహిత్యాన్ని రాజనీతిని సమతూకంలో నడపించిన అసాధారణ ప్రజ్ఞాశాలి - చరిత్రలో అగ్రగామిగా నిలిచిన పురుషుడింకొకడు ఇంతకు ముందు లేడు - తన పూర్వీకుడైన లార్డ్ మార్లేబరోను గూర్చి రాస్తూ చర్చిల్ ''పదాలు తేలికైనవి, బోలెడన్ని ఘనకార్యాలు మాత్రం కష్టతరమైనవి, అరుదైనవి'' అంటాడు. అవును అది నిజమే కాని ఉన్నతమైన, సజీవమైన ఆకర్షకమైన పదాలు కూడా కష్టసాధ్యమైనవి, అరుదైనవి ఉన్నత లక్ష్యసాధనకు అంకితమైన వ్యక్తిత్వ నిర్మాణంలో అది కూడా ఒక భాగమేనని చర్చిల్ నిరూపించేడు

చర్చిల్ రచనలలో ఉత్తేజకమైన, ఆకర్షకమైన పార్శ్వం ముందుగా పాఠకులను ఆకట్టుకుంటుంది 'నా బాల్య జీవనం' (My Early Life - 1930) అనే రచన ప్రపంచ సాహిత్యంలోని గొప్ప వినోదభరిత సాహసగాథలతో నిండినది. పాఠశాల విద్యార్థిగా చర్చిల్ అల్లరి చేష్టలు, పోలో ఆట, అశ్వికదళంలో లెఫ్టినెంటుగా ఉండడం, క్యూబాలో యుద్ధసమాచార విలేఖరిగా పనిచేయడం, భారతీయ సరిహద్దు జిల్లాలలో పనిచేయడం, బోయర్ యుద్ధకాలంలో సూడాన్, దక్షిణాఫ్రికాల్లో పనిచెయ్యడం - వీటికి సంబంధించిన అనుభవాలన్నీ ఆగ్రంథంలో ఉన్నాయి ఈ దశలో త్వరితగతి, నిష్కర్షతో కూడిన తీర్పులు, చైతన్య వంతమైన అవగాహన అతనికి ప్రత్యేకతను గుర్తింపును ఇచ్చేయి యువకుడైన చర్చిల్ పదచిత్రణలో కేవల అర్థస్ఫూర్తి మాత్రమే కాక దృశ్య తీక్షతకూడా సమృద్ధంగా ఉండేది ఆ తర్వాత చిత్రరచన ఆయన కొక కాలక్షేప చర్య అయింది ''ఆలోచనలు - సాహసాలు'' (Thoughts and Adventures 1932) అనే రచనలో చిత్రకల్పన తనకిచ్చిన సంతోషాన్ని గూర్చి ఆయన అందమైన చర్చలు చేసేడు ఆయనకు ఉజ్జ్వలమైన రంగులంటే ఇష్టం వెలిసిపోయిన రంగులంటే చికాకు ఏమైనా, చర్చిల్ రంగుల బొమ్మల కంటే మాటల బొమ్మలు గొప్పవి

చర్చిల్ వర్ణించిన యుద్ధ దృశ్యాలు సాటిలేనివి యుద్ధ వర్ణనల సందర్భంలో ఆయన సైనికుడి కంటే ఎక్కువ వాడిగా కనిపిస్తాడు. కఠోర నియమాలతో నిండినదైన మేధోగ్రాహకమైన పార్లమెంటు అనే పాఠశాల ప్రాంగణంలో ప్రవేశించే సందర్భాలలో కూడా చర్చిల్ అల్లరి పిల్లడనే చెప్పాలి ఉరుకులు పరుగుల్తో పార్లమెంటులో చేరిన చర్చిల్, ఎలాగైతేనేం, ప్రత్యర్థుల కాళ్లకుబంధం, నోటికి కళ్లెం వెయ్యడం నేర్చుకున్నాడు మాటను తిప్పికొట్టే చాతుర్యంలో లాయిడ్ జార్జి ప్రజ్ఞ నందుకుని త్వరలోనే ఉన్నతస్థాయి రాజకీయ ఉపన్యాసకుడిగా వృద్ధి పొందేడు. సూటిగా నాటుకునే ఆయన చతురోక్తులు హద్దుమీరకుండానే చురుకుపుట్టించేవి. సాంప్రదాయిక - ఉదారవాదాల ఎంపికలో ఆయన తన తండ్రి లార్డ్ రాడాల్ఫ్ చర్చిల్ అడుగుజాడల్లోనే నడచేడు ఇంగ్లండు జీవిత చరిత్ర సాహిత్యంలో చర్చిల్ రాసిన తన తండ్రి జీవిత చరిత్రకు నిర్వివాదమైన, గౌరవనీయమైన స్థానముంది

అనేక నిరోధారాలు ఎదురైనా మొదటి ప్రపంచయుద్ధం కూడా చర్చిల్ రాజకీయ - రచనా జీవిత పరిధిని ఎంతో విస్తృతం చేసింది ఆయన చారిత్రక రచనల్లో ఆయన వ్యక్తిగత విషయాలు, చారిత్రక వాస్తవాలు పడుగు పేకల్లా కలిసిపోయాయి తాను చెప్పేదేమిటో ఆయనకు స్పష్టంగా తెలుసు. సంఘటనల వెనుకనున్న చోదక శక్తులను నిర్ణయించే తీర్పులో ఆయనకు గల సంపూర్ణానుభవం నిర్దుష్టమైనది నిప్పులో దూకడానికి, గండకత్తెర వేసుకోడానికి, తుఫానుకెదురు నిలవడానికి తగిన మనిషి తానే అని ఆయన నిరూపించుకున్నాడు ఈ గుణమే ఆయన మాటలకు ప్రకంపనశక్తి నిచ్చింది అప్పుడప్పుడు బహుశా ఆయనలోని వ్యక్తిగత పార్శ్వం ఈ అంశంలో పై చేయిగా కనిపించేది. The World Crisis (1923-29) అన్న పేరుతో వెలువడిన విన్స్టన్ చర్చిల్ అద్భుత స్వీయచరిత్ర తెరకప్పిన ప్రపంచ చరిత్ర అని బాల్ఫర్ (Balfour) అన్నాడు పురావస్తు ప్రదర్శన శాలలోని ప్రామాణిక పత్రాల ననుసరించి చూస్తే ఒక చరిత్రను సృష్టించడానికి కారకుడైన వ్యక్తి తానుగా రాసిన ఆ చరిత్రలో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది

చర్చిల్ జీవితంతో సమానమైనదిగా పరిగణింపబడే ఆయన పూర్వీకుడైన డ్యూక్ ఆఫ్ మార్లబరో గూర్చి రచించిన (1933-38) అద్భుతగ్రంథంలో చర్చిల్ తన పూర్వీకుని శత్రువర్గాన్ని ఎదిరించడంలో నిర్భీతప్రవృత్తిని ప్రదర్శించేడు యుద్ధ దృశ్యాలను వివరంగా వర్ణించడానికి, ఒక యోధుని - రాజనీతిజ్ఞుని రక్షణ నీతిని వెల్లడించడానికి మాత్రమే చర్చిల్ మార్లబరో మీద గ్రంథరచన చేసినట్లనిపించదు అది పరిపూర్ణమైన, దురవగాహమైన వ్యక్తిత్వలక్షణంలోకి సూటిగా చొరబడిన అధ్యయనంలా కనిపిస్తుంది ఆ రచన చర్చిల్‌లో ఇతరగణనీయమైన లక్షణాలన్నిటినీ అటుంచి, ఒక వ్యక్తి నైజాన్ని బయటకు లాగడంలో ఆయనకుగల సామర్థ్యాన్ని నిరూపిస్తుంది. మార్ల బరోలోని పద్ధతికి కట్టుబడే సంకుచితత్వాన్ని, కళ్లు మిరుమిట్లుగొలిపే ఔజ్జ్వల్యాన్ని ఒక పదబంధ ప్రహేళికను నింపే నైపుణ్యంతో తిరిగి తిరిగి ఆలోచించి ఈ గ్రంథాన్ని రచించేడు

తాను ఆక్స్‌ఫర్డు విద్యార్థిని కాలేకపోయినందుకు చర్చిల్ ఎప్పుడూ విచారించేవాడు. తన విరామ సమయాన్నంతటినీ తనను తాను విద్యాసంపన్నుణ్ణి చేసుకోవడానికే వినియోగించేవాడు కాని ఆయన పరిణతగద్యరచనలో ఎక్కడా విద్యాసంబంధమైన సాఖిలిత్యాలు కనబడవు కావాలంటే స్థాలీపులాకన్యాయంగా ఆయన రచించిన Great Contemporaries (1937) అన్న గ్రంథాన్ని చూడండి ఆయన గిబ్బన్, బర్క్, మెకాలేల గద్యశైలిని ఆదర్శంగా తీసుకున్నాడంటారు కాని ఈ గ్రంథంలో ఆయన తనదైన ఆధిక్య లక్షణాన్ని ప్రదర్శించేడు ఆ ప్రముఖ చిత్ర ప్రదర్శనశాలలో చర్చిల్ అలవోకగా స్పృశించిన అద్భుతాలెన్నో! ఎంత అపార మానవతా పరిశీలన పాటవమో! ఎంత ఉదారతో! ఎంత నిందాస్తుతి పూర్వకమైన సంతోష వాలనమో!

ఇంగ్లండులో ప్రతిష్ఠా మహితులైన ఇద్దరు సాహితీ మూర్తులు చర్చిల్ - బెర్నార్డ్‌షాల సరస సమావేశాలు హృద్యంగా ఉండేవి బెర్నార్డ్‌షా సంభాషణకు చర్చిల్ ప్రతిస్పందన ఉల్లాసభరితంగా

ఉండేది షా వేళాకోళాపు, నిర్లక్ష్యపూర్వక చతురోక్తులకు చర్చిల్ పొంగి వచ్చే నవ్వునాపుకోలేక పోయేవాడు. కాని ఎప్పుడూ మౌలికమైన తూకాన్ని తప్పని చర్చిల్ స్వభావానికి అది సరిపడనిది సగం వినోదం - సగం విషాదంగా కళ్లు మూసుకుని మళ్లించడానికి వీల్లేని విదూషక ప్రజ్ఞా మార్గంలో అత్యంత చరమ విరోధాభాసంలో శీర్షాసనం వేసుకునే వ్యక్తిషా తన సర్వస్వాన్ని పణంగా పెట్టి అద్భుతాలను సృష్టించే రచయితకు, అద్భుతాల నెదుర్కొని వాటిని స్వాయత్తం చేసుకునే రాజనీతిజ్ఞుడికి గల భేదం వారిద్దరి మధ్యా ఉంది.

చర్చిల్ శైలిని అంచనా కట్టడం అంత తేలికైన పనికాదు అందులో శాఖా చంక్రమణం లేదు. స్పష్టత, సారళ్యం ఉంటాయి. ఆయన ఆవేశం సహజమైనది విశాలదృష్టితో, చతురతతో తన తాకిడికి పురి ఎక్కిస్తాడు. మంచి కథ తనంతటది తానే నడుస్తుందని ఆయనకు తెలుసు నిరుపయోగమైన అలంకారాలను ఆయన నిరసిస్తాడు. అరుదైన ఆయన రూపకాల సులభ స్ఫూర్తిని కలిగి ఉంటాయి.

చర్చిల్ రచయిత మాత్రమే కాదు, మహావక్త ఆయన పదబంధాలు ఎదుటివారిలో సూటిగా నాటుకుని, నిరుత్తరులను చేసేవి. అతని మాటల్లో ఒకమెరిసే దృఢవిశ్వాసం - అభ్యర్థన, సహజత్వము - అమూల్యత, కలగలసి ఒక యథార్థమైన ఉదాత్తతను రూపొందింది

చరిత్రను సృష్టించినవాడు "The Seven Pillars of Wisdom" అనే రచనతో చరిత్రకారుడైన వాడు ప్రసిద్ధ ఎడారి వీరుడు లారెన్స్ ఆఫ్ అరేబియా ఆయనను గూర్చి రాస్తూ చర్చిల్ ''విమానం మాత్రమే గాలి వేగాన్ని, ఒత్తిడిని అధిగమించి ఎగురగలదు. అలా ఒక తుఫానును హేలగా గొప్పగా ఎదుర్కొని ఎగిరిన వాడాయన'' అన్నాడు. నిజానికి చర్చిల్ కూడా అలాంటి వాడే.

ధృతి తప్పని, గతితప్పని, మహత్త్వ లక్ష్యసాధన దిశగా పరుగులుతీసే మహోపన్యాసకుడు చర్చిల్. చరిత్ర లంకెల్లో బిగిసిపోవే శక్తి అందులో ఉంది. నెపోలియను ప్రకటనలు సర్వసాధారణంగా ఆయన సర్వాంగీణశైలీ లక్షణంతో శక్తివంతంగా రూపొందేవి. చర్చిల్ ఉపన్యాసాలు అందుకు భిన్నమైనవి. స్వాతంత్ర్య సంబంధమైన కీలకఘట్టాలలో, మానవత్వపు ఔన్నత్యాన్ని నిలబెట్టుకోవలసిన తరుణాలలో ఆయన ఉదాత్త ఉపన్యాస ధోరణి ఇంకొకరీతిగా హృదయాలు ఎగసిపడేలా చేసేది. బహుశా తన నిరవధిక స్మృతి చిహ్నాన్ని ఆయన తన ఉపన్యాసాలతోనే నిలుపుకున్నాడనుకుంటాను.

లేడీ చర్చిల్! స్వీడిష్ అకాడమీ తన సంతోషాన్ని మీ ముందు వెల్లడించుకుంటూంది. మా ప్రగాఢ గౌరవాభినందనలను సర్ విన్స్టన్‌కు అందజేయవలసినదిగా మిమ్మల్ని అభ్యర్థిస్తూంది. ఒక రచయితకు ఔజ్జ్వల్యాన్నివ్వడానికి ఉద్దేశించిన సాహిత్య పురస్కారమిది. కాని ఇప్పుడిక్కడ ఒక రచయిత ఈ పురస్కారాన్ని ప్రజ్వలితం చేస్తున్నాడు. మీ భర్త పేరు మీదుగా ఘనత వహించిన మా మహారాజుల చేతి మీదుగా 1953వ సంవత్సరపు సాహిత్య పురస్కారాన్ని స్వీకరించవలసినదిగా మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను.

# అమర వీరుడు - జతిన్ దాస్

- దమ్మాలపాటి వెంకటేశ్వరరావు

స్వాతంత్ర్య సమర మహాయజ్ఞంలో తమ సర్వస్వాన్ని, చివరకు తమ ప్రాణాలను సహితం సమర్పించిన మహానుభావులు ఎందరో ఉన్నారు. వారంతా ఈనాడు మన స్మృతి పథంలో లేరు. స్వాతంత్ర్య సౌధ నిర్మాణంలో వారి పాత్ర పునాది రాళ్ళవంటిది. పునాది రాళ్ళు పైకి కనపడవు. కాని సౌధపు బలమంతా వాటి మీదనే ఆధారపడి ఉంటుంది. వారిప్పుడు మన మధ్య లేరు. ఆ స్వాతంత్ర్య వీరుల త్యాగాల ఫలితంగా లభించిన స్వాతంత్ర్య ఫలాలను నేడు మనం అనుభవిస్తున్నాము. దేశ భవిష్యత్తుకు సంబంధించి వారి కలలు సాకార రూపం ధరించాయా అనే ప్రశ్నకు నేటి భారతదేశ పరిస్థితులు అనుకూల సమాధానాన్ని ఇవ్వడం లేదు. దేశం కోసం వారు తమ సర్వస్వాన్నీ త్యాగం చేస్తే, స్వార్థం కోసం దేశాన్ని సర్వతోముఖంగా దోచుకోవాలనే నాయకమ్మన్యులు మనకు ఈనాడు అసంఖ్యాకంగా కనబడుతున్నారు. పరాయి పాలనలో మగ్గుతూ కూడ ఆనాటి నాయకులు స్వాభిమానాన్ని ఎంతగానో ప్రదర్శిస్తే, నేటి మన నేతలు స్వార్థంతో స్వాభిమానాన్ని తాకట్టు పెడుతున్నారు. ఒక అర్ధ శతాబ్దంలో ఇంతటి మార్పు వచ్చిందంటే మనకు ఆశ్చర్యంతో పాటు విషాదం కలుగక మానదు. ఈ పరిస్థితికి ఎక్కడో ఒక చోట అడ్డుకట్ట వేయకపోతే దేశ భవిష్యత్తు అంధకార బంధురమవుతుందనడంలో ఎట్టి సందేహం లేదు. మార్గభ్రష్టమవుతున్న దేశాన్ని తిరిగి సరైన మార్గంలో పెట్టాలంటే మనకు ప్రేరణను అందించగల ఆనాటి మహనీయుల దేశభక్తిని, త్యాగనిరతిని ఒక్కసారి స్మరించుకోవడం ఎంతైనా అవసరమనిపిస్తుంది.

భారత స్వాతంత్ర్యోద్యమం ద్విముఖంగా సాగింది. ఒకటి గాంధీజీ నాయకత్వంలో అహింసా మార్గాన్ని అవలంబిస్తే, మరొకటి గదర్ పార్టీనాయకత్వంలో హింసా మార్గాన్ని చేపట్టి ముందుకు సాగింది. స్వాతంత్ర్య సముపార్జనకు ఈ రెండు మార్గాలు తమ సహాయసహకారాలను అందించాయి. మార్గాలు భిన్నమైనా లక్ష్యం ఒకటే గనుక ఉభయ మార్గావలంబులు మనకు ఆదరణీయులే. ప్రాతః స్మరణీయులే. గాంధీజీ ఉద్యమం బహిరంగాసాగితే, గదర్ పార్టీ ఉద్యమం రహస్యంగా నడిచింది. ''కంటికి కన్ను పంటికి పన్ను'' అనే ప్రతీకార ఉద్యమంగనుక అది ప్రచ్ఛన్న పద్ధతులను అవలంభించక తప్పలేదు. 'గదర్' అనే మాటకు 'విప్లవం', 'తిరుగుబాటు' అని అర్థం. ''మహజర్ల ద్వారా, సత్యాగ్రహాల ద్వారా, ఉపవాసాల ద్వారా శత్రువుల హృదయాలను మనం ఎంత మాత్రం మార్చలేము. ఇంగ్లీషువారి మానప్రాణాలకు ఈ దేశంలో భద్రతలేదు అన్న భీతిని వారి మనస్సులలో ప్రగాఢంగా నాటితే తప్ప వారు ఈ దేశాన్ని వదిలి పోరు'' అని వీరి దృఢ విశ్వాసం. ఆరోజులలో ఎంతో మంది యువకులను గదర్ పార్టీ ఆకర్షించింది. దేశం పట్ల వారి సమర్పణ భావం తలచుకుంటే నేటికీ మన ఒడలు పులకరిస్తుంది. ఖుదీరామ్ బోసు, ప్రఫుల్ల ఛాకీ, రామ్ ప్రసాద్ బిస్మిల్, భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురు,

చంద్రశేఖర్ ఆజాద్, జతిన్‌దాస్, బటుకేశ్వర్ దత్ మొదలైన వారి చిత్ర పటాలు మన మనో ఫలకం మీద మెదులుతాయి

భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురులు ముగ్గురూ ఒకే రోజున అంటే మార్చి 23, 1931న ఉరికంబమెక్కారు గనుక వీరికి బాగా ప్రచారం వచ్చింది. వీరి మరణం దేశంలో ఒక సంచలనాన్ని సృష్టించింది కాని 62 రోజులు ఆమరణ నిరాహార దీక్షపూని ఆత్మార్పణ చేసిన జతిన్‌దాస్ విస్మృతిపథంలోకి వెళ్లిపోయాడు జతిన్‌దాస్ జీవితం ఒక వీరగాథ అయితే ఆయన మరణం త్యాగ నిరతికి, మూర్తీభవించిన పట్టుదలకు ఒక ప్రబల నిదర్శనం ఆ మహనీయుని గురించి జ్ఞాపకం చేసుకోవడమే ఈ వ్యాసం ముఖ్యోద్దేశ్యం

జతీంద్రనాథ్ దాస్ 1904 అక్టోబరు 27న కలకత్తాలో జన్మించాడు. భారతదేశంలో విప్లవ బీజాలు అంకురించి ఒక ఉద్యమ రూపం ధరించిన సమయమది. జతిన్ దాస్‌కు నాలుగు సంవత్సరాల వయస్సు ఉండగా బెంగాలు అంతటా విప్లవ వాతావరణం నెలకొని ఉంది. ఖుదీరామ్ బోస్, ప్రపుల్లఛాకీ అనే ఇద్దరు యువకుల పేర్లు బెంగాలులో ఇంటింటా మారుమ్రోగుతుండేవి. బ్రిటిష్ వారిని ఎదిరించాలనే ఉద్దేశ్యంతో బాంబులు తయారు చేయాలని సంకల్పించిన ఒక యువకుల బృందంలో వీరు సభ్యులు. అలీపూరు బాంబు కేసుకు సంబంధించి అరవింద ఘోష్ ప్రథమ ముద్దాయిగా కోర్టు కేసునడుస్తున్న రోజులవి. ఈ కేసులో నరేన్ గోస్వామి అనే అప్రూవర్‌ను జైలులో చంపినందుకు కనైయాలాల్ దత్త, సత్యేన్‌బోసులను ఉరితీయడం జరిగింది. ఢిల్లీలో లార్డ్ హార్డింజ్ మీద బాంబు విసిరినందుకు రాష్ బిహారీ బోస్ ముఖ్య అనుచరుడు బసంత్ విశ్వాస్‌ను 1912లో ఉరితీయడం జరిగింది. 1915 నాటికి గదర్ పార్టీనాయకులు పట్టుబడడంతో దేశవ్యాప్తంగా సాయుధ తిరుగుబాటుకు రాష్ బిహారీ బోసు సమాయత్తం చేసిన వ్యూహ రచన మొదటి దశ విఫలమైంది. విష్ణు గణేశ్ పింగ్లే అనే విప్లవకారుణ్ణి పట్టుకోవడం, అనంతరం ఉరితీయడం జరిగింది. అదే సమయంలో జతిన్ ముఖర్జీ తన నలుగురు అనుయాయులతో 1500 మంది సాయుధ పోలీసులను ఎదిరించి ఒరిస్సాలో నిబూరీబాలమ్ నది ఒడ్డున వీరమరణం పొందడం జరిగింది. అప్పుడు జతిన్ దాస్‌కు 11 సంవత్సరాలు. అంతకు రెండు సంవత్సరాల ముందే ఆయన తల్లి మరణించడంతో తండ్రి తన కుమారునికి ఇటువంటి వీరగాథలన్ని చెబుతూ అతని హృదయంలో దేశ భక్తిని నూరి పోశాడు.

మహాత్మాగాంధీ సహాయ నిరాకరణ ఉద్యమానికి పిలుపునిచ్చే సమయానికి జతీంత్రనాథ్ మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు విదేశ వస్త్ర బహిష్కరణ ఉద్యమంలో పికెటింగ్ చేసినందుకు ఆయన్ని అరెస్టు చేయడం జరిగింది. తరువాత విడుదలై ఇంటికి తిరిగి వచ్చిన తరువాత ఆయన తండ్రి ఒక విషయాన్ని స్పష్టం చేశాడు ''బుద్ధి కలిగి చదువు కుంటే ఇంట్లో ఉండు లేకపోతే

ఇంట్లో ఉండడానికి వీలులేదని'' కచ్చితంగా చెప్పేశాడు దీంతో జతిన్ ఇల్లు వదలడానికే నిర్ణయించుకొని కలకత్తా కాంగ్రెసు ఆఫీసుకు మకాం మార్చాడు కాని చౌరీ చౌరా సంఘటనలో గాంధీజీ ఎప్పుడైతే ఉద్యమాన్ని ఉపసంహరించుకున్నాడో విప్లవకారులందరికీ అది ఆగ్రహాన్ని తెప్పించింది దీంతో జతిన్ ఇంటికి తిరిగి వచ్చి కాలేజీలో చేరాడు తరువాత యూనివర్సిటీ టెరిటోరియల్ కోర్‌లో చేరి సైనిక శిక్షణ కూడ పొందాడు ఆయుధాలు ఉపయోగించడం కూడా ఈ శిక్షణలో భాగంగా ఉండేది ఈ సమయంలోనే తాను చివరివరకు గురువుగా భావించే సచిన్ సన్యాల్‌తో ఆయనకు పరిచయం కలిగింది సన్యాల్ యు పిలో అనుశీలన్ గ్రూప్‌కు నాయకత్వం వహించేవాడు కొంతకాలం ఆయన కాంగ్రెస్ తీర్థం పుచ్చుకోవడం కూడ జరిగింది అయితే కాంగ్రెసు పార్టీ ఏమాత్రం మార్పును కాంక్షించడం లేదని ఆయన త్వరలోనే గ్రహించి దానినుండి వైదొలగడం జరిగింది సచిన్ తన అనుయాయులతో హింసామార్గాన్ని అనుసరించడానికే నిర్ణయించుకున్నాడు అది 1924 సంవత్సరం సచిన్‌లాంటి ప్రఖ్యాత వ్యక్తి స్వరాష్ట్రమైన యు పి లో రహస్యజీవితాన్ని గడపడానికి వీలులేదు గనుక ఆయనను కలకత్తా వెళ్లి అక్కడి ఆర్గనైజేషన్ వ్యవహారాలను చూసుకోవలసిందిగా మిత్రులు సలహాయిచ్చారు కలకత్తాలో జతిన్ తన మిత్రమండలితో సహావచ్చి ఆయనలో చేరాడు సచిన్ ఇంతకు ముందే హిందుస్తానీ రిపబ్లికన్ అసోసియేషన్ అనే సంస్థను స్థాపించాడు సర్దార్ భగత్‌సింగ్ మొదలైనవారు ఇందులో క్రియాశీలక సభ్యులుగా ఉండేవారు జతిన్ ఈ అసోసియేషన్‌లో అత్యంతకీలకమైన పాత్ర నిర్వహించాడు. సాయుధ విప్లవానికి కావలసిన ధనాన్ని, ఆయుధాలను సేకరించే బాధ్యత ఆయన స్వీకరించాడు కిద్దర్‌పూర్ ఓడరేవులో నావికులతో సంబంధపెట్టుకొని వారు దొంగతనంగా తీసుకొని వచ్చే పిస్తోళ్లను, రివాల్వర్‌లను కొనడం చేసేవాడు ఇందుకు కావలసిన ధనాన్ని సేకరించడానికి ప్రభుత్వ ఖజానాను దోచుకోడానికి కూడ ఆయన వెనుకాడలేదు. వీటితోపాటు బాంబులు సమకూర్చుకోవలసిన అవసరం విప్లవకారులకు ఎంతైనా ఉంది. దేవగఢ్‌లో ఒక ఇంటిని తీసుకొని బాంబుల తయారీకి జతిన్ వ్యూహరచన చేశాడు.

కాన్పూరులో జరిగిన హిందుస్తానీ రివల్యూషనరీ అసోసియేషన్ రహస్య సమావేశంలో దేశవ్యాప్తంగా సాయుధ తిరుగుబాటుకు నిర్ణయం తీసుకోవడం జరిగింది కార్యాచరణ సంఘానికి రామ్ ప్రసాద్ బిస్మిల్‌కు నాయకత్వం అప్పగించడం జరిగింది వారికి ఆయుధాలు సమకూర్చి పెట్టే బాధ్యత జతిన్ తన భుజస్కంధాల మీద వేసుకున్నాడు రామ్ ప్రసాద్ బిస్మిల్‌ను గురించి ఈ సందర్భంలో కొంత వివరణ ఇవ్వడం సముచితంగా ఉంటుంది బహుళ ప్రచారం పొందిన కాకోరీ మెయిల్ దోపిడీ కేసులో ఈయన ప్రధాన ముద్దాయి 1927 డిసెంబరు 19న గోరఖ్‌పూర్ జిల్లా జైలులో ఈయన్ని ఉరితీయడం జరిగింది తాను స్వయంగా రచించి అనవరతం గానం చేసుకునే గీతం ఇప్పటికీ కోట్లాది మంది యువకులను ఉద్రూతలూగిస్తూనే ఉంటుంది

'సర్ ఫరోశీ కీ తమన్నా అబ్ హమారే దిల్‌మే హై

దేఖనాహై జోర్ కితనా బాజూ - ఏ - కాతిల్‌మేహై'

'ఆత్మ బలిదానం చేయాలనే ప్రబలమైన కోర్కె నా హృదయంలో ఉంది హంతకుని భుజ శక్తి ఎంత తీవ్రంగా ఉందో చూడవలసి ఉంది' ఈ గీతాన్ని గానం చేస్తూ ఆయన ఉరికంబం ఎక్కాడు జతిన్‌దాస్ కూడ ఈ దాడిలో పాల్గొన్నాడు అయితే ప్రభుత్వం మెరుపువేగంతో ఈ కుట్రను ఛేదించింది యు.పిలో నలభై మందిని అదుపులోకి తీసుకోవడం జరిగింది అయితే జతిన్, లాహిరీ అనే మరొక విప్లవకారునితో కలకత్తా పారిపోయాడు తరువాత జతిన్‌ను అరెస్టు చేసి మేదినీపూర్, అలీపూర్, మైమెన్‌సింగ్ జైళ్లకు వరుసగా తరలించారు ఇక్కడ జైలు అధికారుల దుష్ప్రవర్తనకు నిరసనగా జతిన్ 22 రోజులు నిరాహార దీక్షపూనాడు తరువాత డి ఐ జి జోక్యం ఫలితంగా దీక్ష విరమించడం జరిగింది అనంతరం నేరం ఋజువుకాక పోవడంతో ఆయన్ని విడుదలచేయడం జరిగింది.

1929 ఏప్రిల్ 8న ఢిల్లీ సెంట్రల్ అసెంబ్లీ హాలులో బాంబు విసిరినందుకు భగత్‌సింగ్, బటుకేశ్వర్ దత్‌లను అరెస్టు చేయడం జరిగింది. అంతకుముందు లాలాలజపత్‌రాయ్ మరణానికి కారణమైన లాహోరు అసిస్టెంట్ పోలీసు సూపరింటెండెంట్ సౌండర్స్ హత్యకేసులో భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురులు పోలీసులకు దొరకకుండా తప్పించుకొని తిరుగుతున్నారు. లాహోరు కుట్ర కేసులో జతిన్ కూడ ఒక ప్రధాన ముద్దాయి. ఆయన్ని అరెస్టు చేసి లాహోరుజైలుకు తరలించారు రాజకీయ ఖైదీలపట్ల జైలు అధికారులు అమానుషంగా ప్రవర్తించడానికి నిరసనగా జతిన్ ఆమరణ నిరాహారదీక్ష పూనాడు ప్రభుత్వం దిగివచ్చి జైలు పరిస్థితులను సమీక్షించడానికి ఒక కమిటీని వేసింది. కమిటీ ఇచ్చిన హామీ మేరకు భగత్‌సింగ్, తదితరులు దీక్ష విరమించారు. కాని జతిన్‌దాస్ కు సంబంధించినంత వరకు సమీక్షించడం, కోర్కెలు ఆమోదించడం ఒకటి కాదు. ఈ విషయంలో భగత్‌సింగ్ చేసిన అభ్యర్థన కూడ ఆయన పట్టుదలను సడలించ లేక పోయింది. ఈవిధంగా 62 రోజులపాటు నిరాహార దీక్ష కొనసాగించి 1929 సెప్టెంబరు 13న ఈ గదర్ వీరుడు కన్నుమూశాడు.

అయితే ఆయన చేసిన అత్యుత్తమ బలిదానం వృథాకాలేదు. అదే సంవత్సరం డిసెంబరులో జవాహర్‌లాల్ అధ్యక్షతన జరిగిన లాహోరు కాంగ్రెసు 'పూర్ణస్వరాజ్యం' తీర్మానాన్ని ఆమోదించింది ఈ విధంగా తాను జీవించి ఉండగా కాంగ్రెసును ప్రభావితం చేయ లేకపోయినప్పటికి తన మరణం ద్వారా దానిలో ఒక క్రియాశీలతను, నవస్ఫూర్తిని సంచరింపజేసి జతిన్ అమరత్వసిద్ధిని పొందాడు. ఈ మహనీయుని స్మృతి ఒక దీపస్తంభంవలె భారతీయులను వెలుగు వైపుకు నడిపిస్తూనే ఉంటుంది.

# డాక్టర్ జి.వి. కృష్ణరావు రచనలు : తాత్విక దృక్పథం

– డా॥ జి. వెంకటస్వామి

తాత్త్విక దృక్పథం ప్రాతిపదికగా సృజనాత్మక, విమర్శనాత్మక రచనలు చేసి తెలుగులో ఒక విశిష్టమైన సాహిత్య సంప్రదాయాన్ని సృష్టించిన ఖ్యాతి 1979లో అస్తమించిన శ్రీ జి వి కృష్ణరావుకిచెందుతుంది తాత్త్వికుడైన రచయిత చేసిన రచనలు మామూలు రచయితల రచనలకంటె ఏరకంగా భిన్నంగా వుంటాయో కృష్ణరావు రచనలు చూస్తే తెలుస్తుంది

తత్వవేత్తకు వుండవలసిన జిజ్ఞాస, భావాలలో ఆసక్తి, విమర్శనాత్మకమైన మనసు, జీవితాన్ని నమ్రతతో అంగీకరించడం, జీవితంపట్ల సమగ్రమైన దృక్పథం. ఈ లక్షణాలన్నీ కృష్ణరావులో కనిపిస్తాయి. "An unexamined life is not worth living " అన్న సోక్రటీసు సూక్తి కృష్ణరావు జీవితానికి నర్తిస్తుంది.

ప్రాచ్యపాశ్చాత్య వైజ్ఞానిక సంప్రదాయాలను ఆయన మాదిరిగా క్షుణ్ణంగా తెలిసినవారు సమకాలిక పండితులలో బహుకొద్దిమంది మాత్రమే

అలాగే పేరు ప్రఖ్యాతులకోసం పాకులాడకుండా, ఒక లక్ష్యంకోసం జీవితాంతం ఆయనవలె సాహిత్య సృష్టిచేయడం కూడా అరుదైన విషయం. ఇన్నిటిని మించి ఆయన దృక్పథం మానవవాదతత్వ ప్రేరితమైనది

సార్వజనీనమైన మానవత్వపు విలువలను ప్రతివ్యక్తి తన అనుభవంలోకి తెచ్చుకోవాలని ఈ తత్వం లక్షిస్తుంది ఈ దృక్పథం అలవర్చుకున్నవాడు కావడంవల్ల, కన్ను మూసేవరకు కృష్ణరావు భావపరిధి విశాల పడుతూనే వచ్చింది గత వైభవాన్ని కీర్తించే పునరుద్ధరణ వాదం, జాతిలో, వర్గంలో భాగంగా తప్ప వ్యక్తి అస్తిత్వాన్ని గుర్తించడానికి నిరాకరించే ఇతర సమిష్టి తత్వాలు హ్యూమనిస్టుగా కృష్ణరావు అంగీకరించలేదు. వ్యవస్థీకృత ఛాందసత్వాలను ఎదుర్కొంటూ మానవేంద్రనాథరాయ్, బెర్‌ట్రాండ్ రసెల్ సాగించిన భావపోరాటాలు కృష్ణరావుని ఎంతగానో కదిలించి వేశాయి.

## మార్క్సిజం

1933 నాటికే కృష్ణరావు నాస్తికుడు మొదటినుంచీ మానవత్వపు విలువలంటే మక్కువ చూపించేవాడు. కాలేజీలో చదివేరోజులలో కృష్ణరావుకి గోపీచంద్‌తో పరిచయమైంది గోపీచంద్ తనకి ఎం. ఎన్. రాయ్ రచనలు, మార్క్సిజాన్ని పరిచయం చేశాడు దానితో ''జీవితానికి ఒక మార్గం, రచనకు ఒక లక్ష్యం ఏర్పడ్డా'' యని కృష్ణరావే ఒక సందర్భంలో చెప్పుకున్నారు. ఈ రోజుల్లోనే పయోధిని (1935) అనే కమనీయమైన ఖండకావ్యం రచించారు మొదటి దశలో కృష్ణరావు దృక్పథానికి పదును పెట్టింది శ్రీ త్రిపురనేని రామస్వామి.

తత్వవేత్తల భావాలను తెలుగులో చెప్పడానికి ప్రయత్నించినవారిలో గోపీచంద్, కృష్ణరావు ముఖ్యులు తత్వ శాస్త్రంలో వీరు ఎక్కువ శ్రద్ధ చూపడానికి కారణం మానవ జీవితాన్ని తీర్చి దిద్దడంలో తత్వ శాస్త్రానికి అధిక ప్రాముఖ్యత కలదన్న విశ్వాసం కలవారు కావడం చేతనే బహుశా దీనికి ఎం. ఎన్

రాయ్ ప్రభావం కూడా కారణం కావచ్చు తాత్త్విక చింతన లేక స్వతంత్ర విచారణ పొడమదని నమ్మిన వాడు కావడం చేత కృష్ణరావు వైదిక, అవైదిక దర్శనాలను లోతుగా పరిశీలించారు మానవుని మూలతత్వాన్ని గురించి అన్వేషణ చేసిన ప్లేటో, అరిస్టాటిల్, లాక్, రూసో, కాంటో, జె .ఎస్ మిల్, డ్యూయీ, రసెల్, రాయ్ మొదలైన తత్త్వవేత్తల సిద్ధాంతాలను అధ్యయనం చేశారు

## భిక్షాపాత్ర

డిగ్రీ పూర్తిచేశాక, నిరుద్యోగిగా వున్న రోజుల్లో కృష్ణరావు మార్క్సిస్టు దృక్పథంతో కాశీఖండంనించి వ్యాస నిష్క్రమణం కథావస్తువుగా భిక్షాపాత్ర (1937) రచించాడు. భారతీయ ఆధ్యాత్మిక ప్రతిభకు ప్రతీక అయిన వ్యాసుడు కాశీలో అన్నపూర్ణ వాకిట్లో నిలబడి, ఆకలిబాధకు ఓర్చుకోలేక తను బోధించిన ఆధ్యాత్మిక తత్వానికి పశ్చాత్తాపడినట్టు చివరికి మార్క్స్‌కి దగ్గరగా వచ్చినట్టు, ఆ ఏకాంకికలో చిత్రించారు. తర్వాత కాశీలో ఎం ఎ విద్యార్థిగా 'కావ్యజగత్తు' వ్రాశారు భరతుడి నించి పండిత రాయలవరకూ, ప్లేటోనించి మార్క్స్ వరకు ఉన్న మహనీయుల సూక్తులను ఉల్లేఖిస్తూ, కావ్యవస్తువు సామాజిక వ్యవస్థని బట్టి ఎలా మార్పుచెందుతుందో నిరూపించిన గ్రంథమిది ఆ రోజుల్లో సంప్రదాయ మార్క్సిస్టుల విమర్శలకి ఇది గురయింది

రెండో ప్రపంచయుద్ధం ముగిశాక 1946లో డెహ్రాడూన్‌లో ఎం ఎన్. రాయ్ నడిపిన అధ్యయన తరగతులకు కృష్ణరావు హాజరుకావడం జరిగింది రాయ్ మార్క్సిజం వైఫల్యాన్ని, అది సమకాలీన ప్రపంచ అవసరాలకు ఎలా చాలని దవుతుందో వివరించేసరికి, కృష్ణరావు తేలిపోయాడు. రాయ్ చెప్పేవరకు తాను సొంతబుద్ధి ఉపయోగించి, మార్క్సిజంలోని లోపాలను గమనించకపోవడం అన్యాయమనుకున్నాడు.

## కావ్య పరిశోధన

ఈ పునరాలోచన తర్వాత కృష్ణరావు పింగళిసూరన కళాపూర్ణోదయం పరిశోధనకి పూనుకున్నారు. ఆ పరిశోధనా ఫలితాలను "Studies in Kalapurnodayam" అనే పేరుతో పొందుపరచారు. ఈ తీసిస్‌ని విశ్వవిద్యాలయాల్లో తెలుగు రీసెర్చికి ప్రమాణాలు నిర్ణయించేటప్పుడు ఆదర్శంగా పెట్టుకోవచ్చు. కావ్యం కాని, కళా రూపం కాని యాదృచ్ఛిక సంఘటనలను ప్రదర్శించదని ఆ సంఘటనల మధ్య కారణ కార్య సంబంధం వుంటుందని ఈ పరిశోధనా వ్యాసంలో నిరూపించాడు.

ఇక్కడ వివరించడానికి సాధ్యంకాని చారిత్రక పరిస్థితుల కారణంగా భారతదేశం కాలక్రమాన్నిబట్టి ఇరువయ్యో శతాబ్దిలో వున్నా, సాంస్కృతిక స్థాయిలో, సామాజిక పరిణామ మట్టంలో మధ్యయుగాలలో నివసిస్తున్నది. ఇండియాలో ఇంతవరకూ రినైజాన్స్, రిఫర్మేషన్ ఉద్యమాలు రాలేదు. చారిత్రకంగా తయారుగాలేని భారతీయ సమాజాన్ని విప్లవానికి సన్నద్ధం చెయ్యడమెలాగా అన్నదె ఇక్కడి మేధావుల, రచయితల సమస్య భారతదేశంలో అన్నిటికంటె ముందు జరగవలసింది యూరోపియన్ పునరుజ్జీవనం వంటి వైజ్ఞానిక విప్లవం. యూరప్‌లో రినైజాన్స్ వుద్యమం మానవవాద విలువలైన హేతువాదం, వ్యక్తిస్వేచ్ఛ, ఆత్మవిశ్వాసం నెలకొల్పింది. మానవుడు అనంతశక్తి సంపన్నుడన్న విశ్వాసాన్ని కలిగించింది. వ్యక్తి వికాసానికి దోహదం చేసే నూతన జీవిత దృక్పథాన్ని ఉద్బుద్ధం చేసింది.

అధికాధిక సంఖ్యలో విముక్తి పొందిన వ్యక్తుల నైతిక ఆచరణనుంచి మాత్రమే హ్యూమనిస్టు వ్యవస్థలు రూపుదిద్దుకుంటాయి. ఈ విధమైననైతిక ఆచరణని ప్రేరేపించడమే సాహిత్య ప్రయోజనమని కృష్ణరావు విశ్వసించేవారు. సాహిత్యానికి, తత్వశాస్త్రానికి [illegible] వైరుధ్యం వుందని కూడా ఆయన భావించలేదు.

ఈ దృక్పథం ముఖ్యంగా కృష్ణరావు వ్రాసిన నవలల్లో కనిపిస్తుంది. వీటిలో ముఖ్యమైనవి కీలుబొమ్మలు (1951), పాపికొండలు (1977) [illegible]

''స్వాతంత్ర్యం అంటే ఏమిటి? మానవుడు దానిని ఎందుకు కోల్పోతున్నాడు? తిరిగి దానిని సాధించే మార్గం ఏమిటి? ఆర్థిక రాజకీయ హేతువు లెంతవరకు మానవజీవితాన్ని మార్చి వేస్తున్నవి? వ్యక్తుల కర్తవ్యమేమిటి?'' - ఈ జిజ్ఞాసను రేకెత్తించడానికే కృష్ణరావు ''కీలుబొమ్మలు'' రాశారు నవల పేరే స్వేచ్ఛ ఆవశ్యకతని సూచిస్తుంది. ఇందులోని ప్రతి పాత్ర ధర్మాచరణలో పరాభూతమై పోతుంది కొందరు అజ్ఞానంవల్లా, కొందరు జ్ఞానం ఉన్నా ఉద్రేకాలవల్లా ధర్మాచారణలో విఫలులౌతారు. నైతికత, స్వేచ్ఛ, ఆలోచనకి, ఆచరణకి మధ్య ఉండే వైరుధ్యం మానవుడు ధర్మాచరణ నుంచి వైదొలగడానికి కారణాలు, మొదలైన జీవిత సమస్యలు ప్రధానంగా ఈ నవల నడుస్తుంది. ఈ నవలలోని సంఘటనలన్నీ కారణ కార్య సంబంధం కలిగివుంటాయి. సరైన టైంలో సరైన నిర్ణయాలు తీసుకోలేని అశక్తతవల్ల ఈ నవలలోని పాత్రలు కీలుబొమ్మలుగా మారాయి. అంటే వారంతా స్వేచ్ఛని ఏదోరకంగా కోల్పోయారు స్వేచ్ఛ అంటే భౌతిక, సామాజిక వాతావరణ దౌష్ట్యం నుంచి మానవుడు క్రమాభివృద్ధిగా విముక్తుడు కావడమే. స్వేచ్ఛావంతులు కారు కుమక, ఆ పాత్రలు తమ వ్యక్తిత్వ వికాసానికి అవరోధంగా నిలిచివున్న అడ్డంకులను తొలగించుకోలేక జీవితంలో విఫలులౌతారు. సొంతకాళ్ళమీద నిలబడలేని వ్యక్తులు తమ అసమర్థతను కప్పిపుచ్చుకోడానికి ''సంఘం'' అనే సమిష్టి భారాన్ని ఎలా వంకగా చూపుతారో ఈ నవలలో చిత్రించబడింది భారత దేశంలో గ్రామాలు ఏ రకంగా వున్నాయో, ఏ రకంగా తయారవుతాయో, జీవితంలో మార్క్సిజం ఏ రకంగా చాలనిదవుతుందో వివరస్తూ, మానవ స్వాతంత్ర్యాన్ని చర్చించినది ఈ నవల.

మానవుడు తన స్వేచ్ఛని కాపాడుకోడానికీ, పెంపొందించుకోడానికీ సృష్టించుకున్న సిద్ధాంతాలు, వ్యవస్థలు చివరికి మానవుడి స్వేచ్ఛనే కబళించేస్థితికి వచ్చాయి. ఈ విషమస్థితి నుంచి బయటపడాలంటే, మానవత్వపు విలువలను పునరుద్ధరించాలి. నైతిక ఆదర్శాన్ని అనైతిక సాధనాల ద్వారా సాధించవచ్చుననే దృక్పథాన్ని తప్పని నిరూపించాలి. ఈ ప్రయోజనం కోసమే కృష్ణరావు ''పాపికొండలు'' రచించాడు. ఇది అసంపూర్తిగా మిగిలి పోవడం విచారకరం.

కృష్ణరావుకి మొదటినుంచి బౌద్ధం అంటే ప్రత్యేకమైన అభిమానం. బౌద్ధంలోని హేతువాదం, నైతికదృష్టి ఆయన్ని ఆకర్షించి వుండవచ్చు. రాగరేఖలు (నవల), బొమ్మ ఏడ్చింది (నాటకం) బౌద్ధ ఇతివృత్తాల ఆధారంగా నడిచినవే.

సేచ్ఛా పిపాస, సత్యాన్వేషణ ప్రధాన లక్ష్యాలుగా ఎంచుకుని, అన్ని విషయాలకు మానవుణ్ణే కొలమానంగా భావించి, తెలుగు సాహిత్యంలో మానవ వాదతత్వ ధోరణులను ప్రవేశపెట్టిన ఘనత కృష్ణరావుదే. సోపోక్లీజ్ వలెనే కృష్ణరావు కూడా జీవితాన్ని నిశ్చలంగా, సంపూర్ణంగా దర్శించాడు.

(ఆంధ్ర జ్యోతి సౌజన్యంతో)

# కాంతితో పరుగుపందెం

- డా॥ చాగంటి కృష్ణకుమారి

డాబా మీద నుంచుని రోడ్డు మీద వచ్చే పోయే జనాన్నీ, వాహనాలనీ చూస్తూ కాలం గడపడం ఒకప్పుడు బాగానే ఉండేది. ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి బస్సులు, లారీలు, స్కూటర్లు, కార్లు, ఆటోలు ముక్కుపుటాలు ఎగిరి పోయేలా పొగ వదులుతూ, కళ్లు మండి పోయేలా దుమ్ము రేపుతూ ఉంటాయి. చెవులు చిల్లులు పడేలా అరుస్తూ, ఆవైపుకీ, ఈవైపుకీ పరుగులు పెడుతూ ఉంటాయి ఆ రద్దీలో రోడ్డు దాటడానికి అవస్థలు పడుతూ మనుషులు కనిపిస్తారు రోడ్డు మీద కనిపించేది అంతా వేగమే! పరుగులు పెడుతున్న వేగం, ఆగిపోయిన వేగం, ఆగి, నిలబడిపోయిన వేగం వరుసగా నిలబడిపోయిన వాహనాలలోని మనుషులు నిస్పృహాయంగా, ఆతృతగా విసుగ్గా కనిపిస్తారు

కారులో సరదాగా షికారుకి వెళితే బాగుంటుంది కానీ, ఎప్పుడు? ఎప్పుడు బాగుంటుంది? రోడ్డు బాగున్నప్పుడు, రోడ్డు మీద మనకారు ఒక్కటే పోతూ ఉన్నప్పుడు, కారు వేగాన్ని పుంజుకోవాలి ఎంత వేగం? ఎంత వేగాన్ని అందుకోగలం? వేగానికి గరిష్ఠ విలువ ఎంత? యక్ష ప్రశ్నలలో ఇది కూడా ఒక ప్రశ్న. ''అన్నింటి కంటే వేగంగా ప్రయాణించేది ఏది?'' 'మనస్సు' అని సమాధానం చెప్పి ధర్మరాజు నూరు శాతం మార్కులు యక్షుడు దగ్గర సంపాదించాడు

యువ ఐన్‌స్టైన్ ట్రామ్‌లో కూర్చుని ఆఫీసుకు వెళుతూ సాపేక్ష సిద్ధాంతం గురించి కలలు కంటున్నాడు ' కాంతి వేగంతో సమానమైన వేగంతో ప్రయాణించగలిగితే ఎంత అద్భుతంగా ఉంటుందో కదా'! అనుకొన్నాడు. వేగానికి కాంతి వేగమే గరిష్ఠ విలువ. ఏ వస్తువూ అంతకు మించిన వేగాన్ని సాధించలేదు. ఆ సంగతి తెలుసుకొన్న ఐన్‌స్టైన్ తన ట్రామ్ కాంతితో సమానంగా పరుగు పెట్టాలనుకొన్నాడు. అంతకుమించిన వేగాన్ని సాధించి కాంతిని ఓడించాలనుకోలేదు.

ఇంతకీ కాంతి ఎంత వేగంతో ప్రయాణిస్తుంది? సరదాగా కారులో షికారుకి మనం కోరుకొన్నట్టుగానే కాంతి కూడా తన ప్రయాణానికి అడ్డంకులు లేని ఖాళీ ప్రదేశాన్నే కోరుకొంటుంది అది ఏ ప్రతిబంధకాలు అసలే లేని ప్రదేశం, శూన్యప్రదేశం (Vacuum) శూన్య ప్రదేశంలో ఒక సెకండుకీ 300 మిలియన్ మీటర్ల వేగంతో కాంతి పరుగు పెడుతుంది వేగానికి గరిష్ఠ విలువ ఇదే! ఈ రికార్డును బద్దలు కొట్టడం మానవ నిర్మిత వాహనాలకూ, మానవ మాత్రులమైన మనకూ సాధ్యమయ్యే పనేనా!

మరి అటువంటప్పుడు కాంతితో పరుగు పందెం ఏమిటంటారా? కాంతిని ఓడించడానికి మార్గాలు లేకపోలేదు. మనం ఎలాగూ దాని వేగాన్ని అందుకోలేం. కాబట్టి దాని వేగాన్ని తగ్గించేస్తే సరి! కాంతి ప్రయాణిస్తున్న మార్గంలో అడ్డంకులు కల్పించి, దాని వేగాన్ని తగ్గించి, ఇంకా తగ్గించి, ఇంకా మరింతగా తగ్గించేస్తే, మనమే దాని కంటే ఎక్కువ వేగంతో ప్రయాణిస్తున్నాం అని ప్రగల్భాలు పలకవచ్చు.

కాంతి మార్గంలో పదార్థం ఉంటే, పదార్థకణాలు కాంతితో రకరకాల అన్యోన్య చర్యలు (inter-actions) జరుపుతాయి. అవి కాంతిని శోషించు (absorb) కొంటాయి. చెల్లా చెదరు (scatter) చేస్తాయి. వక్రీభవనం (reflection) చెందిస్తాయి. నీరు, కటకం (lence) పట్టకం (prism) వీటిని కాంతి మార్గంలో ఉంచినపుడు కాంతి పుంజాలు వంగుతాయి. ఈ వంగడాన్నే వక్రీభవనం అంటారు వక్రీభవనం వల్ల కాంతి వేగం శూన్యంలో కంటే యానకం (medium) లో కొంత తగ్గుతుంది నీరు, పట్టకం, కటకం వంటి యానకాలు కాంతి వేగాన్ని వక్రీభవనంవల్ల చెప్పుకోదగినంతగా తగ్గించవు.

వక్రీభవనానికి కూడా ఒక పరిమితి ఉంది అది పదార్థస్వభావం మీద ఆధారపడి ఉంటుంది. వక్రీభవనం ద్వారా శూన్యంలో కాంతి వేగం విలువకి సగం విలువదాకా తగ్గించేటందుకు అవకాశం ఉంది ఇంతకు మించి మరి తగ్గదు వక్రీభవనం కారణంగా, యానకంలో కాంతి వేగం తగ్గడంతో, యానకంలోని పదార్థపు కణాలకి, కాంతిని శోషించుకొందికి ఎక్కువ అవకాశం దొరుకుతుంది యానకంలో కాంతి వేగం ఒకానొక విలువ కంటే తగ్గిపోతే, శోషణం ఎక్కువ అయి పదార్థం కాంతి నిరోధకంగా మారిపోతుంది కాంతిని తనగుండా మరి పోనివ్వదు దీనిని బట్టి చూస్తే కాంతితో పరుగు పందెం పెట్టుకొని గెలవటం అసాధ్యం అనిపిస్తుంది మనం గెలవాలంటే కాంతి ప్రయాణించడానికి ఒక యానకాన్ని సృష్టించాలి అది కాంతి నిరోధకంగా మారి పోకూడదు కాంతిని తనగుండా వెళ్లనివ్వాలి, కానీ నెమ్మదిగా వెళ్లనివ్వాలి ఎంత నెమ్మదిగా అంటే, మన కారు కంటే నెమ్మదిగా, మన సైకిల్ కంటే నెమ్మదిగా, అంత దాకా ఎందుకు మన కాలి నడక కంటే నెమ్మదిగా - అప్పుడు - అటువంటి యానకాన్ని మనం కల్పించగలిగినప్పుడు వేగంలో కాంతిని జయించగలం

ఇందుకై ఏం చేయాలి? యానకంలో కాంతి వక్రీభవనం పెరగాలి. తద్వారా కాంతి వేగం తగ్గాలి కానీ కాంతి శోషణం పెరగకూడదు వీలైతే అసలు శోషణం జరగనే జరగకూడదు యానకంలో కాంతి వేగం తగ్గటం వల్ల శోషణం పెరిగిపోయి యానకం కాంతి నిరోదకంగా మారిపోవటం అనే ప్రతిబంధకాన్ని శాస్త్రజ్ఞులు మొన్నీ మధ్యనే తొలగించుకోగలిగారు అటువంటి యానకాల సృష్టికి వారు లేసర్‌ల సహాయాన్ని తీసుకొన్నారు. లేసర్ దుస్తులు తొడిగిన అతిశీతల పరమాణు మేఘాలను కల్పించారు. ఇది ఒక వ్యవస్త. లేసర్, పరమాణువులు కలిసి ఉన్న ఒక అనుగుణమైన వ్యవస్థ - A choherent system of lacer and atoms ఈ వ్యవస్థలో కాంతి ప్రయాణిస్తే వచ్చే ఫలితాలన్నీ, వింతలూ, విడ్డూరాలే! విద్యుదయస్కాంత ప్రేరిత పారదర్శకత (Electromagnetically induced transparency) ఈ విడ్డూరాలలో ఒక విడ్డూరం కాలిఫోర్నియా (California) లోని Stan Ford University కి చెందిన పరిశోధకులు లేసర్ దుస్తులు తొడిగిన లెడ్ పరమాణువుల యానకంలో కాంతి 1 సెకండుకీ 180 వేల మీటర్ల వేగంతో ప్రయాణించడాన్ని సాధించారు. కాంతితో పరుగుపందెం పెట్టుకొనేటందుకు ఈ తగ్గింపు మనికి ఏ మాత్రం సరిపోదు ప్రపంచంలో సైకిల్ పందేలలో రికార్డు అయిన అత్యధిక వేగం విలువ కంటే ఇది చాలా చాలా ఎక్కువ Nature పత్రిక మొన్నీమధ్యనే ఒక శాస్త్ర పరిశోధనా రిపోర్టును ప్రచురించింది. Cambridgeలోని Roland Institute for Scienceకి చెందిన వినీ వెస్టర్ గార్డ్‌హా అతని సహచర్యులు లేసర్ దుస్తుల పరమాణు మేఘాలను రూపొందించి వాటిలో కాంతి సెకండుకీ 17 మీటర్ల వేగంతో ప్రయాణించడాన్ని ప్రదర్శించాడు. అసాధారణ గేర్ నిష్పత్తి ఉన్న సైకిల్‌ని ట్రెడ్ మిల్‌పైన సెకండుకీ 92 మీటర్ల వేగంతో తొక్కి Bruce Brest Ford ప్రపంచ రికార్డును సృష్టించాడు దీనిని బట్టి ఇతను కాంతి వేగం కంటే పలురెట్లు ఎక్కువ వేగంతో ప్రయాణించాడన్న మాటే కదా! Cambridge శాస్త్రజ్ఞులు కాంతి వేగాన్ని ఒక సెకండుకీ కొన్ని సెంటిమీటర్లు దాకా తగ్గించవచ్చునని విశ్వసిస్తున్నారు. ఈ లెక్కన ముందు ముందు మన కాలినడకే కాంతి వేగం కంటే ఎక్కువ వేగంగా ఉండవచ్చు. ఈ విధంగా కాంతి మనతో పెట్టుకొన్న పరుగు పందెంలో చిత్తుగా ఓడిపోయింది

ఒక చిన్న సందేహం - శూన్య ప్రదేశంలో కాంతికీ మనుస్సుకీ పరుగు పందెం పెడితే ఎవరు గెలుస్తారు? ధర్మరాజుగారి సమాధానం రైటేనా?

# జ్ఞానవికాసంలో తర్కం పరిధి

(తత్వ శాస్త్రం)

- బి. ఎస్. రాములు

తర్కం అంటే కేవలం ఛలం, జల్పం, వితండం, కుతర్కం కాదు. దానిని విస్తృతార్థంలో చూసినట్లయితే శాస్త్రీయ పద్ధతి (Scientific Method) గూడ తర్కంలో భాగమే దేనినైనా అర్థం చేసుకొనే ప్రక్రియలో విచక్షణ, విమర్శలు అంతర్గతంగా ఉంటాయి బుద్ధి పనిచేస్తుంది బుద్ధి అంటే తర్కమే విస్తృతార్థంలో కేవలం నిగమనతర్కం (deductive logic) - న్యాయప్రయోగం ద్వారా నూతన విషయాలు ఆవిష్కారం కాని మాట నిజమేకాని, అంతకుముందు అంత స్పష్టంగా లేని విషయం స్పష్టమవుతుంది

జ్ఞాన వికాసంలో తర్కం ( విస్తృతార్థంలో) ఎక్కడ అంతమై నూతన భావజాలం ఎక్కడ ఆవిష్కారమవుతుందో చెప్పడం కష్టం తర్కం సహాయంతో విషయాన్ని అవగాహన చేసుకొంటాం అవగాహన చేసుకొన్న విషయాన్ని మననం చేసుకుంటాం. మనన ప్రక్రియ అంటే పాదుగుడు ప్రక్రియ. ఈ పాదుగుడు ప్రక్రియాకాలం పూర్తిఅయి, ఒకడి అదృష్టం పండితే, అతడు నూతనావిష్కారం చేస్తాడు ఆవిష్కారం అంతర్బుద్ధి (intuition) ఫలితమైతే, దానిని బుద్ధి ( తర్కం) ద్వారా ఇతరులు అర్థం చేసుకొంటారు. ఇది జ్ఞాన వికాస పద్ధతి.

మనకు సంప్రదాయంగా వస్తున్న తర్కం ద్వంద్వం తర్కం - ''పూర్తిగా అవును'' లేదా ''పూర్తిగా కాదు'' (All or none principle). పూర్తిగా నలుపు లేదా పూర్తిగా తెలుపు అనే తర్కం. దీనికి భిన్నంగా బుద్ధుడు భవతర్కాన్ని (logic of becoming) ప్రవేశపెట్టాడు. పూర్తిగా తెలుపేకాదు, పూర్తిగా నలుపేకాదు, మధ్యలో అనేక షేడ్లు ( బూడిద రంగులాంటివి) ఉంటాయి అంటుంది బుద్ధతర్కం. ఈ మధ్యదశలను ( రంగుల షేడ్లను) గూడ పరిగణనలోకి తీసుకోవాలంటాడు బుద్ధుడు. దీనినే ఆధునికులు ఫజ్జీ (Fuzzy) లాజిక్ అంటారు. ఈ తర్కం ఆధారంగానే గదినిబట్టి వెలుతురు, ధ్వని తీవ్రతలను స్వయంచాలితంగా మార్చుకొనే టి.వి.లు, బట్టల బరువు ఎంత? మురికి ఎంత? ఎటువంటి మురికి? ఎంతసబ్బు, నీరు, కరెంటు వాడాలి? అనే విషయాలను తనకైతానే నిర్ణయించుకొనే వాషింగ్ మెషీన్లు వచ్చాయి.

ఆచార్య నాగార్జునుడు ఒక మాట చెప్పాడు : వాదన మూడు అంశాల ప్రాతిపదికగా జరుగుతుంది. ఒకటి. తన అర్థం దెబ్బతింటున్నప్పుడు వాదించాల్సిందే. రెండు: రెండో వానికంటే తనదే పైచేయి అని నిరూపించుకోవడానికి చేసే వాదన, ఇది ఛలం, జల్పంలాంటిది. ఇది హీనమైంది. మూడు: అవతలి వానినుంచి ఏదైనా నేర్చుకోవాలనే ఉద్దేశంతో వాదించడం, ఈ మూడోది ఉత్తమం. తర్కాన్ని శాస్త్రీయ పద్ధతిలో చూసినప్పుడు అది చాల ఉపయోగకరమైనదే

- సంపాదకుడు

మా చిన్నప్పుడు మేం ఒక ఆట ఆడుకునే వాళ్ళం.

ఆ ఆట పేరు ''నువ్వు చూసిన ప్రతిదీ నేను చూసిందే''.

''నువ్వు విన్న ప్రతిదీ నేను విన్నదే''.

''నువ్వు చూసిందాన్ని నీకన్నా ముందే ఎప్పుడో చూశాను'' అని వాదించడంతో మొదలవుతుంది.

నేను ఒక అగ్గిపెట్టె తీసుకొనివచ్చి చూపిస్తాను ఏరొకరు ''నేనది ఇది వరకెపుడో చూశాను'' అని అనేస్తాడు నేను సిన్మా టాకీసుల వెంట, ఆఫీసుల వెంట, రోడ్ల వెంట, పెంటకుప్పల వెంట కుప్పలన్నీ వెతికి కొత్త కొత్త సిగరెట్ (ఖాళీ) డబ్బాల్ని, కొత్తరకం (ఖాళీ) అగ్గిపెట్టెల్ని వెతికి తెచ్చేవాన్ని. '' ఇవి చూసినావా'' అని నేను అడిగితే ''ఎప్పుడో చూసిన'' అనేవాడు నేను ప్రతిసారి ఓడిపోతున్నందుకు కోపం, దుఃఖం వచ్చేది

నా మనసుకు తెల్సు వాడు యివన్ని అదివరకెపుడు చూడలేదని. నేను వెతికి పట్టుకొచ్చాక చూసి దాన్ని తాను ఎప్పుడో చూసానని వాదించడమే వాడి పని అని.

శ్రమనాది. పేరు పెద్దరికం, శ్రమ ఫలితం, గెలుపు వాడిదిగా మారే ఆ తర్కం నన్ను నిరాశకు లోనుచేసింది ఏడ్చేసాను నా ఏడుపు వాడికి మరింత సంతోషాన్నిచ్చింది

తర్వాత ఆ తర్కంలోని కిటుకును తెల్సుకొని తిరగబడ్డాను "నీ యవ! అసలు నువ్వు ఏ ఒక్కటీ నాకన్నా ముందు తెల్సుకోలేదు. వినలేదు, ఒకవేళ ఉంటే ఏమేం ఉన్నాయో చెప్పు అని వాడి తర్కాన్ని వాడికి అప్పగించాను

వాడు రెండు రోజుల్లోనే ఓడిపోయాడు. వాడి దగ్గర కొత్తదేమీ లేక ఓడిపోయాడు. నేనేమో కొత్తవి కనుక్కొన్నా కూడా ఎందుకు ఓడిపోయాను? అయినా ఎందుకు నా ప్రయత్నాల్ని కొనసాగించాను? అదొక ఆసక్తి, పట్టుదల. దానివల్ల నేను ఎన్నో కొత్త విషయాల్ని తెల్సుకున్నాను.

భారతీయ తత్వ శాస్త్రాల్లో తర్కనిపుణులు ప్రవేశించి ఈ పిల్లల ఆటను శతాబ్దాలుగా ఆడారు వారు కనుక్కున్నదంటూ ఏదీ ఉండదు. ఎవరో సంపాదించిన జ్ఞానాన్ని అదేం కొత్తకాదని, అది నీకన్నా ముందే తెలుసని అది అసలు సత్యం కాదని వాదించడం వీరి అలవాటు. రాజకీయవాదులు కూడా ఎదుటి పార్టీవారిని ఇదే తర్కంతో విమర్శిస్తారు ఈ తర్కాన్ని ఛలం అని జల్పం అని, వితండం అని కూడా మనం పిలువవచ్చు. మా దృక్పథం, ఆచరణ యిదీ అని చెప్పడానికి వారి వద్ద ఏమీ ఉండకపోవచ్చు. కానీ తర్కంలో ఎదుటివారిని గెలుస్తారు. వీరిని ఓడించడం ఎలానో తెల్సుకోవాడానికి పంచతంత్ర కధలు చదవాలి.

మనం చిన్నప్పుడు ఆడుకునే ఆటల్లో తర్కవిద్య అభ్యాసం ఇలా జరిగిపోతుంది. కొందరు తత్వవేత్తల పేరిట, రాజకీయనాయకుల పేరిట, సాహిత్య విమర్శ పేరిట ఈ ఆట ఆడుతుంటారు. రాజు కంటే మొండివాడు బలవంతుడంటారు. వీళ్ళు అలాంటి మొండివాళ్ళు, బలవంతులు.

ఈ ఆట ఆడడానికి వేల ఏళ్ళుగా కొన్ని పదబంధాలు, ప్రశ్నలు, చర్చాపద్ధతి రూపొందుతూ వచ్చాయి. తర్క విద్యరూపంలో ఎంతో శ్రమపడి తమ ఆచరణతో అనుభవంతో సాధించిన జ్ఞానాన్ని పరాయీకరించి తన జ్ఞానంగా పోజు కొట్టుకోవచ్చు. దోపిడి వర్గాలు ఈ పద్ధతిని అనుసరిస్తాయి. శ్రామిక కులాలు ఎన్నో కష్టాలకోర్చి పొందిన అనుభవాల్ని బ్రాహ్మణవాదులు, దోపిడీ వర్గాలు ఈ పద్ధతి ద్వారా స్వంతం చేసుకొని వారిపైనే పెత్తనం చేశారు. బుద్ధుడికి తర్కంలోని లోపాలు, ఆచరణ శూన్యత తెల్సు అందుకే శుష్క పండిత చర్చలు అనవసరం అని, ఆచరణ ప్రాథమికమని భావించాడు.

చిన్నప్పుడు ఆడుకునే ఆటల్లోలాగా తిరగబడి నువ్వు చూసిన ప్రతీది నేనింతకు ముందు చూసిందే

అని బుద్ధుడు వాదనకు దిగలేదు నా వాదన వల్ల గెలిచిన నేను కనుక్కొన్న కొత్త విషయం ఏమిలేదు కాని నేను ఓడిపోయిన ప్రతిసారి ఎన్నో కొత్తవిషయాలు తెల్సుకోగలిగాను అందువల్ల ఛలతర్క వితండవాదులు ఈ తర్కవిద్యతో గెలిచినప్పటికీ కొత్తగా కనుక్కునేది ఏమి ఉండదు ఇంకొకడు సాధించింది నాదే అని గెలుచుకోవడం లేదా ఖండించడం తప్ప.

కొత్తది కనుక్కునేవారికి గెలుపనే ప్రసక్తి ఉండదు.

నేను కనుక్కున్నానని సంతోషం ఉంటుంది. ఆ సంతోషాన్ని ఇతరులకు పంచుతాడు అది ఇదివరకే కనుక్కోబడి ఉంటే దాన్ని విన్నవారు నీవు కనుక్కోవడం గొప్ప విషయమే కాని ఫలానా ఆయన ఇదివరకే కనుక్కున్నాడు. ఫలానా పుస్తకంలో ఉంది చూడు అంటాడు అతడా పుస్తకాన్ని చూస్తాడు. ఆ పుస్తకం చదవకుండానే ఆ విషయాన్ని స్వయంగా కనుక్కున్నందుకు ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ఇలా ఎంతమంది ఎన్ని విషయాలు కనుక్కున్నారో అధ్యయనం చేసి వారికన్నా కొత్తవిషయాలు కనుక్కోవాలనుకుంటారు ఈ క్రమంలో గెలుపు ఓటముల ప్రసక్తి ఉండదు సమాజం అప్పటిదాకా సాధించిన జ్ఞానాన్ని సొంతం చేసుకోవడం ఉంటుంది.

తర్కం వాద ప్రతివాదాలు, వాటిలో గెలుపు ఓటముల ప్రసక్తి వర్గసమాజానికి చెందినవి సమాజం వర్గాలుగా చీలిపోయి స్వీయ వర్గ ప్రధానమైన క్రమంలో గెలుపు ఓటముల ప్రసక్తి వచ్చింది అది సామాజిక శాస్త్రాల్లో ఇప్పటికీ కొనసాగుతున్నది అయితే అది ఒక్కటే జరిగి ఉంటే సమాజం వేల ఏళ్ళ క్రితం లాగే ఉండేది మనిషి నిరంతర అన్వేషణతో ఆసక్తిగా మరియు అనివార్యత ననుసరించి ముందుకు సాగాడు. ఎన్నో విషయాలను తెలుసుకున్నాడు, కనుక్కున్నాడు.

అందుకే భౌతిక శాస్త్రాల్లో తెలుసుకోవడం, కనుక్కోవడం, అందరికి అందుబాటులోకి రావడం అనేవి ఇప్పటికీ కొనసాగుతున్నాయి. వీటి వల్ల మానవ సమాజాం ఎంతో సౌఖ్యవంతం కాగలిగింది

కాగా గెలుపు ఓటముల చర్చ తీరు మానవ సమాజాన్ని విజేతలుగా, పరాజితులుగా, పాలకవర్గాలుగా, పీడిత వర్గాలుగా రెండుగా చీల్చింది. శుష్క తర్క విద్య సామాజిక శాస్త్రాల్లో ప్రవేశించి సైన్సు సాధించిన ప్రయోజనాలను అందరికి అందకుండా కర్మ, పునర్జన్మ వాదాలు, కుల తారతమ్యాలు, ఉచ్ఛనీచాలు, చర్చలు చేసి అందకుండా చేసారు. సమస్త సరుకుల్ని, కళల్ని, శాస్త్రాల్ని సృష్టించిన బహుజనులు ఈ వాదనలో ఓడిపోయి కష్టార్జితం ఇతరుల పాలయింది దాన్ని సరిదిద్దే భావజాలం ప్రజాస్వామ్యాన్ని ముందుకు తెచ్చింది. అది మనిషి బతుకును ప్రాథమికం చేసే ప్రజాస్వామ్య, సోషలిష్టు దృక్పథంతో ప్రారంభమయింది. అది బుద్ధుడిలో పరాకాష్టకు చేరుకుంది.

జల్ప, ఛల, వితండ, శుష్కతర్క విద్యల్లో ప్రావీణ్యం పొందిన దోపిడీ వర్గాల, దోపిడీ కులాల సామాజిక శాస్త్రాల పెత్తనం భౌతిక శాస్త్రాలపై ఉండడం వల్ల సైన్సును వారికనువుగా వాడుకోవడం అనే క్రమం సాగుతుంది. అందువల్ల సామాజిక శాస్త్రాల పద్ధతిని చర్చ, గెలుపు, ఓటములు అనే పద్ధతి నుంచి సమూలంగా మార్చాల్సి ఉంది. తెలుసుకోవడం, కనుక్కోవడం, అన్వేషించడం అనే క్రమాలకు మార్చుకోవలసి ఉంది. ఉత్పత్తి శక్తుల సాధనాల సంబంధాల పరిణామాన్ని అనుసరించి చరిత్రను సామాజిక శాస్త్రాలను రాసే భౌతికవాద దృక్పథం దీన్నించే రూపొందింది.

ప్రకృతి మానవ సంబంధాలు స్వభావాలనుండి, ఆచరణ నుండి, అనుకరణ నుండి జ్ఞానం

పుడుతూ, ఎదుగుతూ, విస్తరిస్తూ వస్తున్నది ఈ క్రమాన్ని జ్ఞానశాస్త్రం చర్చిస్తుంది. దోపిడి వర్గాలకు సమాన పంపిణి, అందరికీ అందించడం అనే అంశాల పట్ల ఆసక్తి లేదు వారికి గెలుపు ఓటముల ప్రసక్తి ముఖ్యమైంది వారు తమకన్నా వెనుకబడిపోయిన వారిని ఎదిగించడం కన్నా వారు ఎందుకు ఎదగలేక పోతున్నారో విమర్శించడమే ముఖ్యమైనదిగా కనపడుతుంది.

అమ్మా అంటే ఏమిటో చెప్పలేక పోయినా అమ్మ అంటే ఏమిటో చాలా మందికి తెలుసు అమ్మ హృదయాన్ని అర్థం చేసికోవడానికి అనుభూతి, పరస్పర స్పందన, ప్రేమ ప్రాధమికమౌతుంది తర్కం సాక్ష్యం ప్రాధాన్యత లేకుండాపోతాయి. ప్రేమ, కరుణ, బౌద్ధ దృష్టి ప్రాధాన్యత ఇదే

తర్క నిర్ధారణ సాక్ష్యాలమీద సాదృశ్యాల మీద తార్కిక సత్యాల మీద ఆధారపడి సాగుతుంది సాక్ష్యం లేకుండా నమ్మని దశను ఎదుర్కొంటుంది పూర్వపక్షం పేరిట చెత్తను తన ప్రతిపాదనకు ప్రాతిపదికగా చేసుకోవల్సి వస్తుంది మూఢవిశ్వాసాల్ని ఖండించడానికి పరిమితమయ్యే హేతువాదం కొత్త మూఢవిశ్వాసాల కోసం, ఎన్‌కౌంటర్లను ఖండించడానికి పరిమితమయ్యే సంఘాలు కొత్త ఎన్‌కౌంటర్ల కోసం, కారంచేడు, చుండూరు హత్యాకాండలను ఖండించడానికి పరిమితమయ్యే ఉద్యమాలు వాటికోసం ఎదురు చూస్తు కూర్చుంటాయి ఈ పని చేయడం మానేస్తే అవి ఉనికిని కోల్పోతాయి

ఇన్నయ్య హోమియోపతిని వ్యతిరేకిస్తూ వ్యాసం రాసాడు. ఆ విధానం పని చేస్తున్న తీరుకు సాక్ష్యం కావాలంటాడు సాక్ష్యంతో నిర్ధారించలేక పోతున్నది కాబట్టి అశాస్త్రీయం అంటాడు ఇతనికి రోగం నయం కావడం ముఖ్యం కాదు. సాక్ష్యం ముఖ్యం తర్కం హేతువాదం ఇంత లోపభూయిష్టమయినది

ఒక తార్కికసత్యం తన సిద్ధాంత ప్రకటన పూర్తిచేశాక ఆ తరువాత వచ్చే కొత్త అంశాల్ని నిరాకరిస్తాయి. తార్కిక సత్యం జడత్వంగా, మూఢ విశ్వాసంగా కొనసాగుతుంది. తర్క విద్యపై నిలబడి దేన్నయినా పూర్వపక్షం చేయడం అనేదశ లేకుండా అది ఎదగడం అనివార్యమౌతుంది. ఈ మాట మరింత వివరంగా అర్థం కావడానికి న్యాయ వైశేషిక దర్శనాలను లోతుగా చదవడం అవసరం.

నిజానికి సాక్ష్యం అనేది తెలిసిన దాని ద్వారా తెలియని దాన్ని అంచనా వేయడానికి సంబంధించినది. సాక్ష్యాలు లేకుండా చేయగల్గితే కోర్టుల్లాగే ఇన్నయ్య, రావిపూడి వెంకటాద్రి, పుట్టా సురేంద్రబాబు, హేతువాదులు చేయగలిగేదేమీలేదని అర్థం. ప్రమాణ వివేచనా పరిమితి ఇది.

ఇలాంటి హేతువాదులు ఉపయోగించే తర్కం హేతు బద్ధత చర్చవల్ల, అనుకరణ, ఆచరణ అనుభవం ప్రయోగం వెలుపల భావాలకు తర్కానికి స్వతంత్ర ఉనికి ఉందని భావిస్తారు వారికి ఆచరణ, అంచనాకన్నా అనుమానం, ప్రమాణం, భావజాలం ముఖ్యం.

మానవ జ్ఞాన క్రమం ఒక ఉత్పత్తి క్రమం. పరోక్ష జ్ఞానం కూడా ఎవరో ఒకరి ప్రత్యక్ష జ్ఞానమే. జ్ఞాన క్రమం ఎకౌంటెన్సి అయితే తర్కం కొంతమేరకి ఆడిట్‌లాంటిది. అయితే దైవభావన కూడా హేతు, ప్రమాణవివేచనం నుండే పుట్టింది.

ఒక డాక్టరమ్మకు తెలిసినట్టుగా వివరంగా తెలియకపోయినా ఒక అమాయక స్త్రీ కూడా తల్లి తత్వం కలిగి ఉంటుంది. తర్కం, సాక్ష్యం, ప్రమాణవివేచనా అనేవి ఆడిటింగ్‌కు సంబంధించినవి.

అకౌంటెన్సీలేకుండా ఆడిటింగ్ ఉండదు. అనుభవం లేకుండా చెక్ చేసికోవడం అనేది ఉండదు అందువల్ల తెలుసుకోవడం, కనుక్కోవడం, అన్వేషణ, అనుకరణ, అనుభవం, ప్రయోగం, ఆచరణ, అంచనా, ఊహ, ''సృజనాత్మక ఆలోచన'' అనే క్రమం జ్ఞానానికి పునాది తర్కం హేతుతత్వం లేకపోయినా మానవుడు తను వేసేచిన ద్వారా, ఆచరణ ద్వారా, అనుభవాల ద్వారా అభివృద్ధిలోకి ముందుకు సాగడం సాధ్యమే అయితే పొరపాట్లు తిరిగి చేయకుండా ఉండే అవకాశం కోసం ఎన్నో కష్టాలకు గురి కావల్సి రావచ్చు అయినంత మాత్రాన ఆడిటింగ్ ప్రాథమికం కాదు. అకౌంటెన్సీయే ప్రాథమికం మానవ సమాజం సాధించిన జ్ఞానం యొక్క అకౌంటెన్సీని ముందు తరాల వారికి అందించడం ప్రాథమికం దాన్ని ఆడిట్ చేయడం ( తర్కించడం వగైరా) సెకండరీ. ఎందుకంటే ప్రతి తరం ఎప్పటికప్పుడు పూర్వ సమాజం సాధించిన అకౌంటెన్సీజ్ఞానాన్ని తెల్సుకొని తనకు తాను తన అనుభవాలరీత్యా ఆడిట్ చేసి కొంటుంది. మనము అకౌంటెన్సీ రూపంలో అందించే దాన్లో కూడా ఆడిటింగ్ ఉంటుంది అది ఎలా సాగుతూ ఉంటుందో ఇ హెచ్ కార్ రాసిన ''చరిత్ర అంటే ఏమిటి'' పుస్తకంలో చూడవచ్చు

తార్కికులుగా మనమేదో పొడిచేస్తున్నామనుకునేదంతా మన తరం ( జనరేషన్) లో మానవ సమాజ జ్ఞాన అకౌంటెన్సీ ( అక్యుమిలేషన్) ని ఆడిట్ చేయడమే ఆ ఆడిట్ సరిగ్గా ఉందో లేదో చెప్పడానికి ఆ ఆడిట్ సూత్రాలు అసలు ఉపయోగపడవు. తిరిగి అక్యుమిలేషన్ (సంచయం)ను అంతా పరిశీలించడం ప్రాథమికం అవుతుంది. అనగా తర్కం అనేది ఈ రెండు క్రమాల మధ్య వచ్చిపోయే ఒక చర్య. అదొక గీటురాయి, బంగారం కారణంగా గీటురాయికి విలువ వచ్చింది. బంగారమే లేకపోతే గీటురాయి తల పగులగొట్టుకోవడానికి, వేట కోసం పనికి రావచ్చు తప్ప బంగారాన్ని కనుక్కోవడానికి కాదు. అంతకు మించి జ్ఞానంలో, జ్ఞాన సాధనలో, జ్ఞాన శాస్త్రంలో తర్కానికి స్థానం లేదు. తర్కం హేతువాదం అనేది నెమరు వేయడం వంటిది. నెమరు వేయనవసరం లేకుండా అరిగించుకునే మనుషులెందరో ఉన్నారు. సైన్సు, ప్రకృతి శాస్త్రాలు అభివృద్ధి చెందడంతో తత్వ శాస్త్రంలోని తర్కం యొక్క ప్రాధాన్యత తగ్గిపోయింది.

తర్కం, హేతుతత్వాలను ఓడించడం ఒక రకంగా క్షణంలో పని. ''మనమన్నదే నిజం'' అని అంగీకరించడంతో తర్కం, హేతువాదం అను శాస్త్రాల చర్చ చచ్చి ఊరుకుంటుంది. మనను అంగీకరించిన వారి పట్ల మనతర్కం దేనికి? '' ఔను నీవన్నది నిజం'' అని ప్రతి దానికి తల ఊపుతూ, మనం ఆచరించేది, ఆచరిస్తు మనం చెప్పేదే చెప్తూవెళ్తే మనతర్కం అతని పట్ల నిరుపయోగంగా మారుతుంది. మనం చెప్పింది విశ్వసించిన తర్వాత మనంవారిని మనతర్కం ద్వారా ఏమీ చేయలేము మనం చెప్పింది నమ్మిన తర్వాత తర్కంతో అవసరం తీరిపోతుంది. చెప్పింది ఆచరిస్తూ పోతే భావ జాలం, నిర్మాణ వ్యవస్థ, ఉద్యమం విస్తరిస్తుపోతుంది

అందువల్ల మనతర్కాన్ని అంగీకరించినవారిని సమీకరించి, మానవీయ సంస్కృతిని, ఆచరణను కొనసాగింపజేసే దృక్పథం ఆచరణ మన పరిధిలోకి తీసుకోవాలి. అలా చేసినప్పుడే ఉద్యమం, వ్యవస్థ, నిర్మాణం వ్యాప్తి చెందుతుంది. అలాచేయకుండా కేవలం చర్చిస్తూ, విమర్శిస్తూ పోతే మనం ఉద్యమాలను నిర్మించలేము. సామాజిక మార్పు తేలేము. ప్రజల చైతన్య స్థాయి ననుసరించి వారు అంగీకరించే అంశాల ద్వారా మనం ఒప్పించే విషయాలవైపు మళ్ళించడానికి ప్రజల పట్ల మనకు గల

ప్రేమ, మనం చేసే త్యాగం ఎంతో ప్రభావం వేస్తాయి. వారి జీవితాలను ఏమేరకు పట్టించుకుంటామో, ఏమేరకు మన మాటల్లో, చేతుల్లో చిత్తశుద్ధి, త్యాగం ఉంటుందో ఆమేరకు మన మాటల్ని విశ్వసిస్తారు

అలా కాకుండా కేవలం చర్చకు, విమర్శకు, రాతకు పరిమితమైతే సామాజిక ఉద్యమం ముందుకు సాగదు. పార్లమెంటరీ పార్టీలకు, విప్లవ ఉద్యమాలకు, సామాజిక ఉద్యమాలకు మధ్య ఉండే తేడా కేవలం అవగాహనకు ఆచరణకు సంబంధించినది కాదు అది ప్రధానంగా చిత్త శుద్ధికి, త్యాగానికి, స్వార్థ రాహిత్యానికి సంబంధించిన తేడా కేవలం విమర్శకు, నోటి మాటలకు పరిమితమైన తర్కవాదులు, ఉద్యమకారులు నిరంతరం కొత్త శత్రువులను, కొత్త మూఢ విశ్వాసపరుల్ని వెతుక్కుంటూ వెళ్ళే వేటలో పడిపోతారు మనం ఈ క్రమంలో ఉన్నప్పుడు మిత్రులు దొరికినప్పటికి వారితో నిర్మాణం చేపట్టి ఉద్యమం నిర్మించకుండా ఊరికే విమర్శ, ఆత్మ విమర్శలతో వారిని కొత్త శత్రువులుగా మార్చుకుంటాము. అలా కొత్త మూఢ విశ్వాసాల్ని, శత్రువుల్ని తయారు చెసికొంటేగాని మన తర్కం హేతుతత్వం ఉనికిని కొనసాగించలేని దశ వస్తుంది

అలా ఉద్యమ నిర్మాణం లేకుండా కేవల భావజాల చర్చకు పరిమితమైతే నిరంతరం కొత్త శత్రువులు, కొత్త మూఢ విశ్వాసాలు అవసరం. అవిలేకపోతే మన తర్క విద్య, తెలివి తేటలు వ్యర్థమౌతాయి అనిపిస్తుంది, కనుక వాటిని మనమే సృష్టిస్తాము లేదా మనకు తెలియకుండానే ఎదుటి వారిలో సృష్టించే ప్రక్రియ ప్రారంభిస్తాము రాజకీయ వాదులు పార్టీలోని తన పోటీదారుల్ని తన అనుచరులుగా కుదించడం కుదరకపోతే తాను ఆధిక్యతలోకి రావడానికి తన వ్యతిరేక పక్షంగా మారేట్టు, పార్టీ నుండి విడిపోయేట్టు కృషిచేస్తారు. తద్వారా ఓడించిగెలిచామనే తృప్తి పొందుతాము. నిజానికి వారికన్నా మనమే ఎక్కువ బలహీనపడిపోతాము. కలిసి ఉండి కృషి చేసినప్పుడు ఉండే ప్రభావం, వాళ్ళు వెళ్లిపోయాక ప్రజల మీద, వారిప్రభావం ఎంతో తగ్గిపోతుంది. అయితే బాధాకరమైన ప్రాపంచిక సత్యం ఏమంటే గాంధీ , నెహ్రూ, ఇందిర, మార్క్స్, లెనిన్, మావో తదితరులనుండి మొదలుకొని సర్పంచ్, గ్రామరాజకీయాలదాకా, ట్రేడ్ యూనియన్‌లతో సహా, భక్తి, ధ్యాన, దేవాలయ కేంద్రాల్లోను, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లోను, ఉద్యమాల్లోను ఇదే ఆచరిస్తున్నారు. సంస్థలో తన ప్రాబల్యంకోసం వ్యక్తిగత స్వార్థానికి ఒడి గట్టడం వల్ల ఇలా జరుగుతుంది. తర్కంలో వాది ప్రతివాది ఇదే పనిచేస్తుంటారు.

తర్కం ఒక రేప్ వంటిది. మనల్ని ప్రేమించే వారిపై, మనల్ని అంగీకరించే వారిపై మన తర్కం నిరుపయోగం అని పైన స్పష్టమైంది. అందువల్ల మనల్ని అంగీకరించని వారి మీదే తర్క ప్రతాపం అని అర్థం. రేప్ అర్థం ఏమిటి? ఎదుటివారి అంగీకారం లేకుండా వారిపై చర్య జరపడం. ఎదుటివారు అంగీకరిస్తే తర్కం హేతుత్వం అవసరం తీరిపోతుంది అప్పుడు ప్రేమ విశ్వాసం పుడుతుంది. ఎదుటివారు అంగీకరించకపోతే చర్చ, తర్కం, హేతుత్వం అనే బల ప్రయోగాల ద్వారా జరిగే క్రమం రేప్‌కు సంబంధించినదే. రేప్‌లో ఎంత క్రూరత్వం ఉంటుందో తెల్సు. అది ప్రతీకారం కోరుతుంది. అది రేప్ చేసిన వారిని హత్య చేయడంతో ముగుస్తుంది. అనగా మనం ఎవరిని ఒప్పించడానికి బయలుదేరామో వారినే మన శత్రువులుగా మార్చుకొని మనను ఓడించి వారుగెలిచే తీరును అనివార్యం చేస్తాము. చర్చ శుష్కతర్కం, హేతుత్వం, ఛలం, జల్పం వల్ల జరిగే నష్టం ఇది.

ఇలా చర్చ అనేది ఒక్కటిగా కలిసి పనిచేసే మనుషుల్ని రెండు వర్గాలుగా, రెండు భావాలుగా, రెండు వేర్వేరు సిద్ధాంతాలుగా చీలుస్తుంది. చర్చ అనే పద్ధతి, దృక్పథం స్వయంగా వాటికవే పాలకవర్గాల

దృక్పథం, ఆచరణ. వారి చర్చా నిర్మాణం భావాలను రెండుగా చీల్చి ఒకదాన్ని సంహరించడం లేదా జీర్ణం చేసికోవడం వారు అలా పక్కా బ్రాహ్మణవాద, పాలకవర్గ వాద దృక్పథంలో కొట్టుమిట్టాడులారు చర్చ పేరిట చాలా మంది ఎదుటివారి భావాలను రేప్ చేస్తుంటారు ఇది వారి స్వభావం కాకపోవచ్చు, కావచ్చు మనకు కూడా తెలియకుండానే జరిగిపోవచ్చు అనగా చర్చా శాస్త్ర ఆచరణే మనని రేపిస్టులుగా, శాడిస్టులుగా మార్చుతుంది బుద్ధుని గొప్పతనం ఏమిటంటే అతను ఎదుటివారు సమ్మతించే పద్ధతిలోనే చర్చ జరిపి తన భావాల్ని వెల్లడిస్తాడు ఒప్పిస్తాడు ఇందులో ఎదుటివారిని ప్రేమించడం ఉంది ప్రేమ పూరితంగా వివరించడం ఉంది తన పక్షంలోకి చేర్చుకోవడం ఉంది కాగా తర్కానికి, తర్క శాస్త్రానికి ఎదుటి పక్షం నించి ప్రేమ పూరితంగా తన పక్షంలో చేర్చుకోవడం అనే నిర్మాణం లేదు ఓడించడం తప్ప. అది ఎదుటి పక్షాన్ని పూర్వ పక్షం పేరిట ఖండిస్తూ తన ఆధిక్యతను అస్తిత్వాన్ని నిలబెట్టుకుంటుంది అందువల్ల తర్క పద్ధతి ''నేతినేతి'' ఇది కాదు అనే పద్ధతిని తీసుకొని పరాకాష్టనందుకుంది వితండం, జల్పం కలిసి చేసే ఆచరణ లేని సమస్త తర్కాలు ఇందులో భాగమే

ఈ రేపిజం ప్రాచీన సాహిత్యంలో, భావజాల రంగంలో, తర్కశాస్త్రాల్లో, నేటి రాజకీయాల్లో కోకొల్లలు, ''నేతినేతి'' ఇది కాదు, ఇది కాదు అంటూ చేసే సత్యాన్వేషణను మీరు ప్రాచీన గ్రంధాల్లో, జిడ్డు కృష్ణమూర్తిలో, కమ్యూనిస్టుల్లో గమనించే ఉంటారు వాళ్ళు ఇది ఔను, అది ఔను అని చర్చను ప్రారంభిస్తే అన్నిటిలోగల ''ఔను'' లను సమీకృతం చేసి తానొక గొప్ప ''ఔను సంచయం''గా ఎదిగి సమాజానికి అందించేవాళ్ళు. వాళ్ళు ఇది కాదు, అది కాదు అనుకుంటూ వెళ్ళారంటే వాళ్ళు కలిసి చేసే ఆచరణ లేకుండా కేవలం మాటలు నేర్చి ప్రతీదాన్నీ, రేప్ చేస్తూ, యిది కాదు అనుకుంటూ వెళ్ళారని అర్థం ఇది ఔను అంటే వెంటనే ఆమెతో, ( ఆ సత్యంతో) సంసారం ( కలిసి ఆచరణ) చేయాల్సి వస్తుంది. కలిసి చేసే ఉమ్మడి కృషిలో పుట్టే జ్ఞానం ఒక అదనపు జ్ఞానసంచయాన్ని కూడా కలిగి ఉంటుంది.

వందమంది కలిసి వంట చేసుకున్నప్పుడు ఉండే గిన్నెలు, కావాల్సిన పొయ్యి, పొయ్యిలోకి కట్టెలసైజు, వండే నేర్పు వేరు ఎవరికి వారు వండుకున్నప్పుడు ఉండే గిన్నెలు వేరు అవి చాలా చిన్నవిగా ఉంటాయి. కలిసి పనిచేసినప్పుడు అవగాహన, జీవిత లక్ష్యాలు ఉన్నతంగా ఉంటాయి విడిగా చిన్నచిన్న గ్రూపులుగా చిన్నచిన్న సంఘాలుగా, చిన్నచిన్న పార్టీలుగా పనిచేసినప్పుడు ఒక్కరు వండుకునే గిన్నెల్లా అవగాహన, లక్ష్యాలు చాలా చిన్నవయిపోతాయి. లక్షలాది మందితో కలిసి పనిచేసే సమిష్టి కృషిలో పుట్టే జ్ఞానం, విశాల దృక్పథం, ఇంగిత జ్ఞానం, సంస్కారం, సంస్కృతి విడి ఆచరణలో, ఏకాంతంలో కలిగే అవకాశం లేదు. మహా నగరాల్లో, పల్లెల్లో ఉండేవారి నాగరికత, సంస్కృతుల మధ్య ఉండే తేడా ఇందువల్లనే ఏర్పడుతున్నది. వందల మందితో హాస్టల్లో జీవిస్తూ చదివే విద్యార్థులకు కలిగే ఇంగిత జ్ఞానం, విశాల దృక్పథం, సంస్కారంలో, ఇంట్లో గారాబంగా పెరిగే విద్యార్థులకు కలిగే అవగాహనలో చాలా తేడా ఉంటుంది. హాస్టల్లో ఉండేవారికి సమిష్టి తత్వం అలవడుతుంది. హాస్టల్లో ఒక మినీ సమాజం పరిచయమై దాంతో ఎలా పోరాడాలో, ఎలా కలిసి జీవించాలో తెలిసి వస్తుంది. సమిష్టి ఆచరణలో ఉండే గొప్పతనం ఇది. ఎంత పెద్ద సంఖ్యలో సమీకరించి ఒక పార్టీగా, సంస్థగా, ఉద్యమంగా నిర్మాణాన్ని ఏర్పరుస్తూ పోతామో అదే స్థాయిలో మనలో విశాల దృష్టి, విస్తృతమైన అనుభవాలు, స్పందనలు, జ్ఞానం, సంస్కారం, సంస్కృతి కలుగుతాయి ఒంటరిగా తిన్నమ్మ రెంటికి ఓర్వదు అనే సామెత ఒంటరితనంలో సంస్కారం కుదించబడడాన్ని తెలియజేస్తుంది.

(ఇంకా వుంది)

# ఆధునిక తమిళ సాహిత్య యుగపురుషుడు - రాజం అయ్యర్

**- కస్తూరి**

నవలా ప్రక్రియ మనకు 19వ శతాబ్దంలో పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్లనే వచ్చింది సంస్కృత సాహిత్యంలో దండి దశకుమార చరిత్రను గద్యకావ్యంగా చెప్పినా, నేటి ప్రమాణాలను బట్టి దాన్ని నవలగా అంగీకరించవచ్చు ఏమైనా తరువాతి సాహితీ స్రష్టలు అలాంటి ప్రక్రియను చేపట్టలేదు

1860ల నాటి నుండే చారిత్రక ప్రేమగాథలు (Historic Romances) బెంగాలీ, మరాఠీ, గుజరాతీ భాషల్లో రాసాగాయి మొదటి నవలలు తెలుగులో 1878లోనూ, 1889లో మళయాలంలోనూ, 1899లో కన్నడంలోనూ వచ్చాయి. మొదటి తమిళనవల 'వివేక చింతామణి' అనే పత్రికలో 1893 ఫిబ్రవరి సంచికలో ఆరంభమై 1895 జనవరి సంచికతో ముగిసింది 'అన్యాయ అపవాదం అల్లత్తు కమలాంబాల్ చరిత్రం' అనే పేరుతో ఆరంభించాక మూడో సంచికలో 'ఆపత్తుక్కిడమాన అపవాదం' (The Fatal Rumour) గా పేరు మార్చుకుంది 1896 డిశెంబరు మూడో తేదీన కమర్షియల్ ప్రెస్సు వారిచే సాధికారికంగా పుస్తక రూపంలో వచ్చింది. నాలుగువందల ముప్పై పేజీల ఈ నవల వెల అప్పుడు రూపాయి ఎనిమిదణాలు మాత్రమే. రిజిస్ట్రార్ క్వార్టర్లీ రిపోర్టు (October - December 1896) సంచికలో పేర్కొన్న కాల్పనిక రచనలన్నీ ఏదో ఒక వ్యాఖ్యను (Remarks కాలంలో) సంతరించుకున్నా 'కమలాంబాల్ చరిత్రం' ముందు మాత్రం ఎలాంటి వివరణ లేకపోవడం గమనార్హం. ఇంతకీ ఈ నవలను బి. ఆర్. రాజం అయ్యర్ రాశాడు.

ఎవరీ రాజం అయ్యర్? ఈ సంగతి సాహితీ జిజ్ఞాసువులందరూ తెలుసుకోదగిన విషయం. మొట్టమొదటి విశేషం ఈ నవల ఆరంభించేనాటికి ఈ రచయిత వయసు కేవలం ఇరవై ఒక్క సంవత్సరాలు మాత్రమే. నవల ప్రచురణ పొందాక రెండేళ్లు తిరక్కుండానే 1898మే నెలలో పేగుల్లో అవరోధం (Intestinal Blockage) విషమించడం వల్ల చనిపోయాడు.

1890ల్లో నిండా ఇరవై ఏళ్లు కూడా లేని ఈ కుర్రవాడు రాసిన నవల మొదటి తమిళనవల కూడా కాదు. వేదాంత నాయకం పిళ్లై రచించిన 'ప్రతాపముదలియార్ చరిత్రం' అనేదే నిజానికి మొదటి తమిళనవల. 1879లోనే దీని ప్రచురణ కూడా జరిగింది. కాని రాజం అయ్యర్ రాసిన నవల మొదటి మంచి నవల. 1932లో ఈ నవలను మద్రాస్ గవర్నమెంటు స్కూళ్ల సిలబస్‌లో చేర్చారు. ఈలోగా ఈనవల చాలా ముద్రణలకు నోచుకుంది. 1959లో కన్నడంలో వచ్చింది. ఆ కన్నడపు అనువాదం పలుమార్లు ముద్రణకు నోచుకుంది. ఇటీవల 1994లో మరో ముద్రణ వెలువడింది కూడా

ఈ విధంగా చరిత్రలో నేటికీ నిలచిన రాజం అయ్యర్. మధురకు ముప్పైమైళ్ల దూరంలో గల 'వాతాళకుండు' అనే ఊళ్లో బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాడు. ఊరు ఆనాటికే చాలా పెద్దది (తన నవలలో వర్ణించిన 'సిరికులం' బహుశః ఇదేనేమో). మదురైగవర్నమెంటు స్కూల్లో చదువుకున్నాడు

(దీని వివరాలను ఏడో అధ్యాయంలో వర్ణనకుపయోగించుకున్నాడు). అక్కడే 1887లో F.A. (First Arts) పాసయ్యాడు. ఈ సమయంలోనే పెళ్లికూడా జరిగింది. పై చదువు కోసం మద్రాసు వెళ్లాడు (తన నవలలోని యువనాయకుడు శ్రీనివాసన్ లాగే). 1889లో మద్రాసు క్రైస్తవ కళాశాలనుండి ఆంగ్ల సాహిత్యంలో పట్టభద్రుడయ్యాడు.

తరవాత లా డిగ్రీకోసం విఫల ప్రయత్నం చేశాడు. దీంతో చాలా నిరాశచెందాడు. తండ్రి మళ్లీ పరీక్ష రాయమన్నా వినలేదు. కుటుంబంతో సంబంధాలు కాని పిల్లల వైనంకాని అంతగా తెలీదు. ఆదిలో తమిళ సాహిత్యమన్నా ప్రత్యేకించి కంబ రామాయణమన్నా చెవికోసుకునేవాడు. తరవాత ఆంగ్ల సాహిత్యమన్నా ప్రత్యేకించి కాల్పనిక కవులు (Romantic poets) అంటే వల్లమాలిన అభిమానం ఏర్పడింది. 'కచ్చిక్కాలం పాకం' అనే ఆధునిక తమిళగేయరచనపైనా, 'మనోన్మానియం' అనే ఆధునిక నాటకంపైనా బృహత్సమీక్షలు రాశాడు. వీటి ద్వారా నాటి తమిళ మేధావి వర్గంలో తనదైన స్థానం సంపాదించుకున్నాడు. 1892లో తమిళ పత్రిక ('వివేక చింతామణి') స్థాపించిన కొందరికి చేరువయ్యాడు వెనువెంటనే సదరు పత్రిక 'వివేక చింతామణి' లో తన రచనా వ్యాసంగాన్ని మొదలు పెట్టాడు.

ఇక్కడ ఆధునిక తమిళసాహిత్యపు ఆవిర్భావానికి పూర్వరంగం చెప్పుకుంటేగాని రాజం అయ్యర్ సాహిత్య వ్యవసాయపు ప్రాముఖ్యం మనం గుర్తించలేము. స్వర్ణ యుగంగా పేరొందిన 'సంగం యుగపు' తమిళ సాహిత్యం పందొమ్మిదో శతాబ్దంలోనే వెలికి తీయబడి పునరుజ్జీవనం పొందింది. పాండిత్యానికి తప్ప సాహిత్య సృష్టికి గౌరవం లేకుండా పోయింది. సంస్కృతం నుండీ, ఆంగ్లం నుండీ, తమిళంలోకి వచ్చినన్ని అనువాదాలుతో పోలిస్తే, తమిళంలో సాహితీ కుసుమాలంతగా వికసించలేదు. తమిళం తీవ్రంగా దిగజారిందని, సంపాదకుడు 1896లో నవలకు రాసిన పీఠికలో వాపోయాడు. ఈ పతనం 1600 నాటి నుంచీ ఆరంభమైంది తెలుగు, మరాఠీ, ఉర్దూ, పర్షియన్ చివరికి ఆంగ్లం, తమిళనాడులో అధికార భాషలుగా ప్రాచుర్యం పొందగా సంస్కృతం మాత్రం మేధావుల భాషగా మన్నన పొందుతూనే ఉంది. పందొమ్మిదో శతాబ్దం ఉత్తరార్థంలో వచ్చిన ద్రవిడ ఉద్యమంతోనూ, సుబ్రహ్మణ్య భారతి (1882-1921) కవిత్వంతోనూ తమిళానికి కొత్త ఊపిరి వచ్చింది ఆంగ్ల భాషాధ్యయనం కొత్త పోకడలను నేర్పింది. ఆదిలో తమిళ నవలా రచయితలందరూ ఇంగ్లీషు తమిళం నేర్చినవారే. కొత్త తమిళ వ్యవహారిక భాష కూడా ఆవిర్భవించింది. మిషనరీ కార్యకలాపాలు కూడా తమిళ భాషలో మార్పులకు దోహదం చేశాయి. అన్ని భారతీయ భాషలలో లాగే పందొమ్మిదో శతాబ్దంలో తమిళంకూడా కొత్త రూపు దిద్దుకోవడం మొదలెట్టింది అంతకు ముందు అందంగా చదవడానికి సులభమైన తమిళ గద్య రచనలు లేవని రాజం అయ్యర్ వాపోయాడు.

ఆవిధంగా మొట్టమొదటి తమిళ నవలకు అంకురార్పణ జరిగింది. 1895లో బ్రహ్మవాదిన్ పత్రికలో 'The Greatness and Littleness of the Man' అనే వ్యాసం రాశాడు. ఈ వ్యాసంలో రచయితకున్న విస్తృత ప్రవేశ ప్రభావాలు కనపడతాయి. రస్కిన్, ఆర్కిమిడీస్, గెలీలియో, స్పెన్సర్,

రినాన్, కాంట్, రూసో, గోధే ( ఆయన పేర్కొన్నవారిలో మరెందరో ఉన్నారు) మొదలుకొని వర్డ్స్ వర్తు, షెల్లీల దాకా ఉదహరించి 'అహం(బ్రహ్మాస్మి' అనే ఉపనిషద్వాక్యంతో ముగిసిన ఈ వ్యాసం రచయిత బహువిషయైక పరిజ్ఞానానికి నిదర్శనం. ఈ వ్యాసం మీద వచ్చిన విమర్శల మాటెలా ఉన్నా, సదానంద సరస్వతి స్వామి అనే పరి(వ్రాజకుడు ఈ రచయితను కావాలని తన సముఖానికి రప్పించుకున్నాడు. తరవాత ఆయనే గురువుగా రాజం అయ్యర్ వేదాంతాధ్యయనం చేశాడు 'తయూమానవర్' తమిళపాటలు ఆయన్నుంచి నేర్చుకున్నాడు. తన నవల్లో ముత్తుస్వామి అయ్యర్, కమలాంబాల్ దంపతులు ఈ పాటలతోనే పరవశిస్తారు (ప్రగాఢమైన ఈ వేదాంతాధ్యయన దశలో ఆయనకెన్నో దివ్యాను భూతులు కలిగాయి. వాటిని తన నవలలో సందర్భానుసారం చొప్పించాడు నవలకు రాసిన చివరి మాటలో తానీ నవలను చాలా 'మానసిక వత్తిడి' కి గురైన కాలంలో రచించినట్టు చెప్పుకున్న కాలం కూడా ఇదేనేమో!

1896లో నవల (ప్రచురణ జరిగేనాటికి పేగుల్లో అవరోధం ఉధృతమై ఆపరేషన్ కనక చేస్తే చావు ఖాయం అని తేల్చారు. వైద్యాల మాటెలా ఉన్నా వ్యాధి తాత్కాలికంగా తనకు తానుగా సమసిపోయింది 1896లో స్వామి వివేకానందుడి అండదండలతో 'The Prabuddh Bharathi, The Awakened India' అనే ఆంగ్ల పత్రిక మద్రాసు నుండి వెలువడసాగింది. రాజం అయ్యర్ దాని ప్రధాన సంపాదకుడు. ఆయన మరణంతో ఆ పత్రిక మూతపడింది. అది నడచిన రెండున్నర సంవత్సరాల్లోనూ 'The Greatness of Vaserdeva Sastny' అనే అసంపూర్తి నవలతో సహా పత్రికలో దాదాపు ప్రతి వ్యాసమూ, శీర్షికా రాజం అయ్యర్ ఒంటి చేతిమీదిగా నిర్వహించి రచించినవే. ఈ వ్యాసాలన్నీ 1905లో 'Rambles in Vedanta' అనే పుస్తకంగా వచ్చాయి. 1897లో స్వామి వివేకానంద అమెరికా పర్యటన ముగించుకుని మద్రాసు వచ్చాడు. చిట్టచివరకు రాజం అయ్యర్ ఆయన్ను కలుసుకున్నాడు. అప్పటికే వ్యాధి విషమించింది. ఈసారి ఆయన్ను వదలకుండా మృత్యువు తనతో తీసుకుపోయింది. 1898మేలో ఆయన చనిపోయాడు. ఈ మధ్య కాలంలో ధ్యానంలోనో, రచనలు చేస్తూనో గడిపాడు. పిల్లలకు సుబోధకంగా వేదాంతాన్ని తెలిపే పత్రికను స్వయంగా పెట్టాలనుకున్నాడు. ఆశించిన ఆర్థికసాయం అందలేదు. తిండీ నిద్రాకూడా ఆశించకుండా తనగదిలో ఎప్పుడూ ఏదో చదువుతూ గడిపేవాడు.

ఇంతటి మహోన్నత వ్యక్తికి, ఇరవయ్యారేళ్ళు నిండగానే, నూరేళ్ళూ నిండి పోవడం తమిళ సాహిత్యానికే గాక, బహుశ, విశ్వ సాహిత్యానికి, వేదాంత ప్రపంచానికి కూడా తీరనిలోటు.

ఏమైతేనేం జీవించిన కొద్ది కాలంలోనూ అపారమైన కీర్తి వచ్చింది. ఆయన కీర్తి కాయానికి మాత్రం చిరాయువు కలిగింది. ఆయన నవల ఈనాడు ఆంగ్లంలోకి అనువదింపబడి, O.U.P వాళ్ళు 1998లో ప్రచురించడమే దానికి నిదర్శనం. స్టువర్టు బ్లాక్ బర్ను దీన్ని అనువదించడమే కాక సుదీర్ఘమైన Afterword కూడా రాశాడు. ఈ వ్యాసంలోని వివరాలన్నీ దాని నుంచి సంగ్రహించినవే 'The Fatal Rumour' శీర్షికతో వెలువడిన ఈ నవల విశేషాలు మరోమారు చెప్పుకుందాం.

# మానసిక దౌర్బల్యం సమాజానికి చేటు

- డా. దేవరాజు మహారాజు

Some scientists seem un willing to engage in public confrontations on borderline science issues because of the effort required and the possibility that they will be perceived to loose a public debate. But it is an excellent opportunity to show how science works at its murkier borders and also a way to convey some thing of its power as well as its pleasure-

*- CARL SAGAN*

భారతీయ సమాజం చాలా విచిత్రమైంది. ఒకవైపు ఆధునికవైజ్ఞానిక పరిశోధనలలో ముందంజ వేస్తూనే, మరోవైపు దేవుడికి, దయ్యాలకు, బాబాలకు, స్వాములకు, అతీంద్రియ శక్తులకు, మూఢ నమ్మకాలకు పెద్దపీట వేస్తుంది. అసలు పూజలు చేసి రాకెట్ ప్రయోగంలో పాల్గొనే శాస్త్రజ్ఞులు, అర్చనలు చేసి సర్జరీ చేసే వైద్యులు మనకున్నారు.

మనకున్న వైజ్ఞానిక సదుపాయాల్ని కాదని వీళ్ళు కనీసం ఒక్క నిమిషం కూడా బతకలేరు అట్లాగని వైజ్ఞానిక స్పృహతో, ఆత్మవిశ్వాసంతో నిలబడనూ లేరు మానసిక దౌర్బల్యం గల పత్రికా విలేకరులు సమాజానికి ఎంత అపకారం చేయగలరో, మానసిక దౌర్బల్యం గల శాస్త్రవేత్తలు, ఉపాధ్యాయులు, రచయితలు అంతకు పదిరెట్లు కీడు చేయగలరు. అదే అక్షర జ్ఞానం లేనివాడు, మానసిక దౌర్బల్యం గలవాడైతే సమాజానికి జరిగే కీడు అంతగా ఉండదు. చదువుకున్న అజ్ఞానుల వల్లనే, పండిత మూఢుల వల్లనే సమాజానికి ప్రమాదం ఎక్కువ. వీళ్ళు శాస్త్రీయతను శాస్త్రీయంగా, అశాస్త్రీయతను అశాస్త్రీయంగా చూడలేరు. అశాస్త్రీయతను తమ మేధోసంపత్తినంతా ఉపయోగించి శాస్త్రీయం చేయాలనుకుంటారు. ఈ ప్రయత్నాలే సమాజాన్ని చావుదెబ్బ తీస్తున్నాయి.

దేశం బాబాలతో, స్వాములతో రోగగ్రస్థమై పోతుంటే, శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు రంగంలోకి దూకరెందుకూ? ఒక పెద్ద డిగ్రీ సంపాదించుకుని, ఓ పది పరిశోధనా పత్రాల్ని ప్రచురించుకుని, మూడు సెమినార్లు, ఆరు సింపోజియాలకు హాజరైనంత మాత్రాన అయిపోయిందా? తమకు ఒక విలువను, గౌరవాన్ని ఇచ్చిన సమాజం పట్ల తమ బాధ్యత తీరిందా? మహర్షి మహేష్ యోగి వేదాలలో ఆధునిక శాస్త్రవిజ్ఞానమంతా ఉంది అనంటే ఎవరూ ప్రతి స్పందించలేదేం? మహర్షి దయానంద సరస్వతి విమానాల తయారీ గురించి వేదాలలో ఉందని వక్రభాష్యాలు చెబితే ఎవరూ పట్టించుకోలేదేం? ఇటు మతానికి, రాజకీయాలకు ముడిపెట్టిన చంద్రస్వామి జైల్లోపడ్డా ఎవరూ పెదవి విప్పలేదేం? సత్యసాయి బాబా నిలయంలో హత్యలు జరిగితే, అదేదో పవిత్రకార్యంగా

భావించారా? ఏదీమన శాస్త్రజ్ఞుల పాత్ర? ఏదీ మన విద్యావేత్తల చొరవ? ప్రభుత్వాలే మూఢత్వంలో కొట్టుమిట్టాడుతున్నప్పుడు వివేకవంతులైనా ధైర్యంగా ముందుకు రావాలి కదా?

తమకు తాము భగవంతులమని ప్రకటించుకున్న 'మానవదేవుళ్ళ' పని ఏమవుతుందో చూస్తూనే ఉన్నాం కదా? పెద్ద పెద్ద వాళ్ళతో ఎన్నెన్ని పరిచయాలున్నా, కోట్లకొలది డబ్బు మూలుగుతున్నా చంద్రస్వామి జైలుకు వెళ్ళక తప్పలేదు. విబూది, స్విస్ గడియారాలు, మంగళసూత్రాల ట్రిక్కులు తేలిపోతున్నాయన్న భయంతోనే సత్యసాయిబాబా పుట్టపర్తిలో సాంఘిక కార్యకర్తగా వేషం మార్చాడన్న విషయం గమనించాలి! ఆయన కట్టించిన ఆసుపత్రులు మానవ ప్రయత్నాలే కాని, భగవత్ సృష్టికి ఉదాహరణలు కావు, అన్ని ఆసుపత్రులలో మాదిరిగానే ఆ ఆసుపత్రులలో కూడా వైద్యవిజ్ఞాన నిపుణులే ప్రాణాలు నిలుపుతున్నారు. బాబాగారి చలవవల్ల ప్రాణాలు నిలవడం లేదు. ఆయన ఇటీవల చేపట్టిన సాంఘిక కార్యక్రమాల్ని తప్పక అభినందించాలి! కాని ఒక అర్ధ శతాబ్దం నుండి హస్తలాఘవంతో జనాన్ని మోసం చేస్తున్నప్పుడు మన ప్రభుత్వాలేం చేశాయి? వైజ్ఞానిక సంస్థలేం చేశాయి? ఆలోచించాల్సిన విషయం కాదా?

'శూన్యంలోంచి - శూన్యం తప్ప మరేది రాదు' అనే సూత్రం ఇప్పటిది కాదు. క్రీ.పూ. 99-55లలో ల్యుక్రిషియస్ (Nil posse crearide nilo - Lucretius) ప్రతి పాదించాడు. ఇన్ని వేల యేళ్ళు గడిచినా మనం శూన్యం లోంచి ఎవరైనా ఏదైనా మేజిక్ చేసి 'సృష్టిస్తే' నిజమేనని నమ్ముతున్నామే! ఇలాంటి విషయాల్లో శాస్త్రవేత్తలు మౌనం వహిస్తారెందుకు? స్వభావ సిద్ధమైన ప్రకృతి సూత్రాలకు భిన్నంగా ఏదీ జరగదని జనసామాన్యానికి తెలియజెప్పరెందుకని? వీరి మౌనమే 'మానవ దేవుళ్ళ' కు ఒక రకంగా బలం చేకూర్చుతోంది. విద్యావంతులు, శాస్త్రజ్ఞులు సామాన్యుడికి అండగా నిలబడక పోవడం వల్లే అతడు అయోమయంలో కొట్టుకుపోతున్నాడు. ప్రవాహానికి ఎదురీదడానికి ఎంతో ఆత్మవిశ్వాసం కావాలి అదెంతో కష్టమైన పని. ప్రవాహంలో పడి కొట్టుకు పోవడం చాలా తేలికైనపని అందుకే ఎక్కువ మంది కళ్ళు మూసుకుని ప్రవాహంలో కొట్టుకు పోవడానికే ఇష్టపడుతున్నారు. అందుకే ఈ సమాజ స్వరూపం ఇలా ఉంది మానసిక దౌర్బల్యం గల కొంతమంది శాస్త్రవేత్తలు, విద్యావంతులు, మేధావులు ప్రజల్లోకి వచ్చి ప్రజల భావనల్ని అర్థం చేసుకుని, నిజానిజాలేవో బహిరంగంగా చర్చించలేక పోతున్నారు.

నిజానికి ఇదే వారి ముఖ్యమైన బాధ్యత-

కొత్త కొత్త విషయాల్ని కనిపెట్టి, దేశాన్ని ప్రపంచ దేశాల మధ్య తలెత్తుకునేట్లు చేయగల శాస్త్రవేత్తలు, ప్రొఫెసర్లు మనకు తప్పకుండా కావాలి. అయితే వారు ప్రయోగశాలలకే కుంచించుకుపోకుండా సామాన్యుడి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తూ వారికి అండగా నిలబడగలగాలి ముందు తరాల్ని ప్రభావితం చేయగలగాలి.

# మనసు అంతరాంతర జ్యోతి స్సీమలను వెలికి దీసిన మనో వైజ్ఞానిక తాత్విక మేధావి కార్ల్ గుస్టాఫ్ యూంగ్

- శివలింగం

కార్లగుస్టాఫ్ యూంగ్ స్విట్జర్‌లాండులోని కేస్‌విల్‌లో 26 జులై 1875 లో పుట్టాడు బాసెల్‌లో విద్యనభ్యసించాడు. మెడికల్ డిగ్రీ పుచ్చుకున్నాడు జూరిచ్ విశ్వవిద్యాలయ సైకియాట్రిక్ క్లినిక్, మెంటల్‌హాస్పిటల్‌లో సైకియాట్రిస్టుగా ప్రాక్టీస్ ప్రారంభించాడు 1909 వరకు పనిచేశాడు 1902లో పారిస్ వెళ్లి జానెట్ క్రింద చదువుకుని సీనియర్ స్టాఫ్ ఫిజిషియనుగా పరిశోధనలు చేసి అనేక పత్రాలు సమర్పించి మంచి గుర్తింపు తెచ్చుకున్నాడు. విదేశాల నుంచి ఉపన్యాసాలివ్వమని ఆహ్వానాలు వచ్చాయి మసాచుసెట్స్ క్లార్క్ విశ్వవిద్యాలయం నుంచి హానరరీ డిగ్రీని గ్రహించాడు మనస్తత్వశాస్త్ర పరిశోధనకు నూతన వ్యాఖ్యాతగా పునాదులు వేశాడు. ఫ్రాయిడ్ ప్రయోగాలు చేసి వాటిని నిర్ధారించడం జరిగింది. యూంగ్ పరిశోధనలు ఫ్రాయిడ్ పనిని విజయవంతం చేసి చాంపియన్‌గా నిలిచాడు 1907లో ఫ్రాయిడ్‌ను కలిశాడు. ఇరువురూ స్నేహితులయారు. పరస్పర అవగాహన విజయవంతం గావడం విశేషం. ఫ్రాయిడ్ స్థాపించిన పత్రికకు సంపాదకుడయాడు అంతర్జాతీయ మనస్తత్వ విశ్లేషణ సంస్థకు ప్రథమ అధ్యక్షుడు (1911).

ఫ్రాయిడ్, యూంగ్, ఆడ్లర్ మనస్తత్వశాస్త్ర పరిశోధనలను సైకో ఎనాలిసిస్ అని పిలిచారు యూంగ్ పరిశోధనలను విశ్లేషణాత్మక మనోవిజ్ఞాన శాస్త్రమని, ఆడ్లర్ పరిశోధనలను వైయక్తిక మనోవిజ్ఞాన శాస్త్రమని పిలుస్తుంటారు. 1912 లో యూంగ్ ప్రచురించిన The Psychology of the Unconscious లో ఫ్రాయిడ్ పరిశోధనలతో విభేదించాడు సైకో ఎనలిటిక్ స్కూల్‌తో అంటే ఫ్రాయిడ్‌తో సంబంధం తెగింది. అప్పటినుంచి యూంగ్ పరిశోధన కృషిని విశ్లేషణాత్మక మనోవైజ్ఞానిక శాస్త్రంగా పరిగణించడం ప్రారంభమయింది. 1913 లో యూంగ్ జూరిచ్ విశ్వవిద్యాలయంలో పనిచేయడం మానేసి శాస్త్రీయ పరిశోధనలకు, మానసిక రోగులకు చికిత్స, పుస్తకాలు రాయడం పనుల్లో మునిగిపోయాడు. ఆదిమ ప్రజల మానసిక గతిని ప్రవర్తనను పరిశీలించాడు. 1921లో ఆఫ్రికా వెళ్ళాడు. న్యూమెక్సికో, అరిజోనాలోని పెబ్లో ఇండియన్లతో గడిపాడు. 1926 లో ఆఫ్రికా మళ్ళీ వెళ్ళి స్థానికులతో గడిపాడు. అమెరికా, ఇండియా, ఇంగ్లండు, అనేక యూరపుదేశాలు తిరిగాడు.

తూర్పు దేశాలనుంచి చాల సమాచారం సేకరించాడు. పండితులతో సంబంధాలేర్పరచుకున్నాడు. రిచర్డు విల్‌హెల్మ్ ఫ్రాంకుఫర్టులో చైనా సంస్థలో అనువాదకుడు. వ్యాఖ్యాతగా వున్నాడు చైనా తత్వశాస్త్రం, కవిత్వంలో మంచి కృషి చేశాడు. 1930లో విల్‌హెల్మ్‌తో కలిసి ఇద్దరూ The Secret of the Golden Flower గ్రంథాన్ని వెలువరించారు. జర్మన్ ఇండాలజిస్టు జిమ్మర్ (1943 లో మరణం)తో ఒక గ్రంథం, హంగేరి పౌరాణికుడు కార్ల్ కెరెన్యితో ఆంగ్లానువాదంలో వచ్చిన గ్రంథం Science of Mythology.

యూంగ్ అనేక గ్రంధాలు రాశాడు. ఆంగ్లంలోకి అనూదితమయినాయి. బ్రిటన్, అమెరికాలలో రచనలన్నీ ప్రచురించారు అతని శాస్త్రీయ కృషి, విశాల దృక్పథం, ఇతరుల భావాలతో ఏకీభవించి తన భావాలను మార్చుకోడానికి వెనుదీయని సంసిద్ధత మనోవైజ్ఞానిక శాస్త్రజ్ఞులలో ఆంతర్జాతీయ ఖ్యాతి గడించడానికి మరింత దోహదపడ్డాయి యూంగ్ బహుభాషా శాస్త్రజ్ఞుడు ఆరుభాషలు తెలుసు 1936లో హార్వర్డు విశ్వవిద్యాలయం గౌరవపురస్కారం, 1938లో ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయం DSC ప్రధానం. ఆక్సుఫర్డులో మనోవైజ్ఞానికుని కివ్వడం ఇదే ప్రథమం. బాసెల్ విశ్వవిద్యాలయం 1944లో యూంగ్‌ను మెడికల్‌సైకాలజీ అధిపతిగా ప్రత్యేకంగా నియమించింది. ఒక సంవత్సరం పనిచేశాడు. ఆరోగ్యం చెడింది జూరిచ్‌లో ఆంగ్ల విద్యార్థుల కోసం ప్రతి సంవత్సరం సెమినార్లు ఏర్పాటు చేసేవాడు C.G.యూంగ్‌ఇన్‌స్టిట్యూట్‌ను స్థాపించడం జరిగింది. యూంగ్ అనుయాయులు శిక్షణ సంస్థలను లండన్, శాన్‌ఫ్రాన్సిస్కోలలో కూడా స్థాపించారు గొప్ప పండితుడు. పురాణాలు బాగా చదివారు మతాలను పరిశీలించాడు. అనేక దేశాల సాహిత్యంతో పరిచయం వుంది యూంగ్‌కు ఒక కొడుకు, నలుగురు కుమార్తెలు యూంగ్ విజయం వెనుక అతని భార్య సహాయం ఎంతో వుంది. 1955లో మరణించింది. యూంగ్ యన్ ఇన్‌స్టిట్యూట్‌లో ఉపన్యాసాలిస్తూ వుండేది. ప్రపంచంలోని మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలకు నిలయంగా వుండేది ఆ సంస్థ అనేకమంది దర్శించారు ఆ సంస్థను

యూంగ్ పర్వత మార్గాలవెంట నడిచేవాడు, జూరిచ్ సరస్సులో ఈదులాడాడు. 80వ యేట ఈ పనులన్నీ మానేశాడు. మనస్సు బాగానే వుండటం వల్ల పుస్తకాలు రాసేవాడు. మాట్లాడటం యిష్టం అలాగే వినడం కూడా, సంభాషణా చతురుడు మంచి కథలు చెప్పేవాడు. సునిశిత హాస్యం తొణికిసలాడేది. ఆయనతో సన్నిహితంగా వుండేవారు చెప్పిన మాటల్ని బట్టి ఆయనకు నటించడం చేతకాదు. యూంగ్ మానవత, కరుణల సజీవ రూపం.

సంకీర్ణత (Complexity), బహిర్ముఖుడు (Extrovert), అంతర్ముఖుడు (introvert) వంటి పదాలు యూంగ్ సృష్టించినవి. ఫ్రాయిడ్ పరిశోధనల ఫలితంగా సాహిత్యంలో మనిషి మనసు లోపలిపొరలను వెలికితీయడం ప్రారంభమయింది. కవిత్వం, నవల, కథలలో బాహ్యపరిస్థితుల చిత్రణ మాత్రమే కాకుండా మనస్తత్వ చిత్రణ ప్రధానంగా మారింది. Myth and Archetype లు కవిత్వ విమర్శలో నూతన ద్వారాలు తెరిచాయి. మొదటఫ్రాయిడ్ తరవాత యూంగ్ బాగా ప్రాచుర్యంలోకి తీసుకొచ్చారు. ఆర్కిటైప్ అంటే Primordial image అని యూంగ్ వివరించాడు. సామూహిక సుప్త చేతనలోని భాగం. పురాణ ప్రతీక (Myth)నుగురించి యూంగ్‌చాలా తీవ్రమైన పరిశోధనాత్మక వివరణలు యిచ్చాడనడంలో సందేహం లేదు. ఆధునిక ఆంగ్ల రచయితకి మిత్ అంటే అనేకార్థ బోధకం. విగ్రహారాధకులు పూజించే సంకేతాలు విగ్రహరూపాలు. పంచభూతాలు, గుర్రం, బల్లెం, గుహ వంటి ప్రాగ్రూప సంకేతాలు కూడా మిత్స్ అవుతున్నాయి. సాహిత్య విమర్శలలో ఫ్రాయిడ్ కంటే

యూంగ్ ప్రభావం ఎక్కువ. A great work of art is like a dream అన్నాడు కలకి, కళకు వున్న సంబంధం వివరించాడు.

ఆర్కిటైప్ అంటే సామూహిక భావప్రతీక, తొలి మానవుడి మతం పురాణం తరవాతకాలంలో మంత్ర తంత్రాచార్యుల అధీనమై ప్రజలకు అందని అమూర్త నిరాకారుడయాడు దేవుడు సామూహిక అచేతనను నిర్వచించడానికి ప్రయత్నించడం అసాధ్యమైన విషయమే దాని హద్దులుగాని, నిజస్వభావంగాని తెలుసుకునే వివేకం మనకు లేదు. మనం దాని వ్యక్త రూపం పరిశీలించడం, వర్ణించడం అవగాహన చేసుకోడం వరకు చేయగలం, యూంగ్ చేసిన పనీ ఇదే. మానవ ఆలోచననూ ప్రవర్తననూ తీర్చిదిద్దే ప్రధానమైన ఆర్కిటైప్స్‌ను వర్ణించాడు బహిర్ముఖ వ్యక్తిత్వం (persona), ఛాయారూపం (అవ్యక్త మానవ సహజ స్వభావం) పురుషునిలోని స్త్రీత్వం (anima), స్త్రీలలోని పుంసత్వం, (animas), వృద్ధజ్ఞాని, భూమాత, ఆత్మ-వంటి పేర్లు పెట్టాడు యూంగ్. ఆధునిక మనోవైజ్ఞానిక తాత్త్వికులలో భారతీయ యోగ శాస్త్ర ప్రభావం వున్న వాడు యూంగ్. యోగాన్ని తిరస్కరించిన మాట నిజం. ఆధునిక పాశ్చాత్యుని మీద ప్రత్యక్షంగా యోగాన్ని రుద్దడం తిరస్కరించాడు. అయితే తూర్పుతో సంబంధం వల్ల ప్రపంచ దృష్టి మారుతుందన్నాడు. పతంజలి యోగం వల్ల అవ్యక్తాన్ని వెలుగులోకి తీసుకురావడానికి, మరింత పెద్దది చేయడానికి దోహదపడింది. యోగంలో చిత్తం, యూంగ్‌లో మనస్సు (Psyche) - కామ మూలాలు, రజో గుణ ప్రభావం వలన చిత్తంలో కామం కలుగుతుంది. యోగశాస్త్రం కోరికలను క్లేశాలంటుంది. అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశాలవల్ల క్లేశాలుద్భవిస్తాయి. ఇవి లేకుండా వ్యక్తిత్వాన్ని వికాసవంతం చేసుకోలేరు మానవుడు గతంలో చేసిన కర్మల సృష్టి కోరిక (Desire) అని యూంగ్ అన్నాడు. అవిద్య వంటివే కోరిక రూపాలు అవే సంసారానికి లేదా పునర్జన్మకు కారణమని యోగం అంటుంది.

అవ్యక్తంలో నిక్షిప్తంగావున్న కోరికలన్నిటిని బయటికి తీసుకు రావడానికి తపస్సు కావాలి. అవ్యక్తం అప్పుడువుండదు, నిత్య చైతన్యుడవుతాడు. ఇటువంటిస్థితి మనస్తత్వ శాస్త్ర దృష్ట్యా అసంభవమంటాడు యూంగ్. సామూహిక అచేతనలోని కోరికలన్నిటిని తెలుసుకోవడం గాని, తొలగించడంగాని జరగదు మనసు పునాదుల విషయంలో ఇరువురకూ కొన్నిటిలో ఏకీభావం వుంది. కామ చరమగమ్యం విషయంలో విభేదించారు. యోగంలో అన్ని కోరికలు తొలగిపోవాలి. సామూహిక అచేతనలోని కోరికల సముదాయ సృజనాత్మకవైయక్తికతయే పరిణతకూ సమగ్ర వ్యక్తిత్వానికి గుర్తు అని యూంగ్ చిత్తం అన్‌కాన్షస్, చిత్తవృత్తి నిరోధం యోగం. సృజనాత్మక మనోవైజ్ఞానిక తాత్త్వికులలో యూంగ్ అజరామరుడు. బౌద్ధ నిర్వాణంలో కూడా అన్‌కాన్షస్‌లో అణగారి వున్న కోరికలన్నిటినీ ఆవిరి చేయాలి. విషయవాసనలన్నిటిని నశింప చేసుకోవాలి అప్పుడే ప్రశాంతత.

నాలుగో కవరు మీది చిత్రం

# దౌడుతీస్తున్న గుర్రాలు



మహమ్మద్ ఉస్మాన్‌ఖాన్

మహమ్మద్ ఉస్మాన్‌ఖాన్ గుంటూరులో 1953లో జన్మించారు తమిళనాడు ప్రభుత్వ సాంకేతిక పరీక్షను ఇచ్చాడు APSRTC విజయవాడలో పనిచేస్తున్నారు

ఆయన చిత్రలేఖనానికి గుఱ్ఱాలు ప్రత్యేకవిషయం అందుకనే ఆయన కుంచె గుఱ్ఱాల చుట్టూ పరిభ్రమిస్తుంది

ఆయన 1985, 88,89,91లో గుంటూరు కళాపీఠమునుంచి, 87, 89, 90, 92లలో విజయవాడ ఆర్ట్ అకాడెమీనుంచి, 1988లో తెలుగు విశ్వవిద్యాలయం నుంచి, 1985లో కళాభారతి గుంటూరునుంచి ఇంకా అనేక సంస్థల నుంచి అనేక బహుమతులను అందుకొన్నారు.

గుంటూరు, ముంబాయి, హైదరాబాద్ ఆర్ట్‌గ్యాలరీలలో సోలో ప్రదర్శనలు పెట్టారు బెంగుళూరు, ముంబాయి, కొచ్చిన్, ఢిల్లీ, హైదరాబాద్‌లలో గ్రూపు ప్రదర్శనలలో పాల్గొన్నారు

ఆయన పెయింటింగ్స్ గురించి హిందూలో మతా జి. సాగర్ "ఉస్మాన్ ఖాన్ అశిక్షిత అశ్వాలు ఏకాంత గుహల్లో, శూన్యంగుండా దౌడుతీస్తున్నట్లు కాన్వాస్ మధ్యలో కేంద్రీకృతమై '' ఉన్నాయి

"అశిక్షిత అశ్వాలు అనియంత్రిత శక్తి ప్రతిమలు తారాపథాలను అడ్డంగా చీల్చుకుపోవాలనే వాటి వాంఛ, అతని చిత్రాలలో అభివ్యక్తమవుతుంది'' అంది కేరళ కౌముది.

"ఉస్మాన్ ఖాన్ కాన్వాసులు మూడోకొలతల ప్రభావాన్ని ప్రదర్శించడానికి చాల దట్టంగా నేయబడ్డాయి'', ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో గీతా డాక్టర్